


యస్. ఆర్. మూవీస్ వారి

# ప్రమీలార్జునీయము

దర్శకుడు: యం. మల్లికార్జునరావు
నిర్మాతలు: ఆదిబాబు • నాగమణి

రచన • పింగళినాగేంద్రరావు • సంగీతం • పెండ్యాల • ఛాయ • రవికాంత్, రహిమాన్
కళ • గోఖలే • నృత్యం • పసుమర్తి, హీరాలాల్

వాహిని విడుదల

నైజాం: ఉషా పిలిమ్స్, సికింద్రాబాద్; మైసూరు: శారదా మూవీస్, బెంగుళూరు: నార్త్ & ఒరిస్సా సరస్వతి పిక్చర్స్, బరంపుర



# శ్రవణానందమూ, కన్నుల పండువ!




## సంగీతానికి జీవం పోసే
## యు. యం. యస్. ఎలక్ట్రో పి. 16

ఆధునిక జీవనంలో విశిష్టమైనది
సాంకేతికంగా పేరెన్నికగన్నది
ప్రయోగంలో సాటిలేనిది

'ప్రింటెడ్ సర్క్యూట్' మొదలయిన
అన్ని ఆకర్షణీయమైన హంగులతో
రు. 250/- లు.
(ఎక్సైజు డ్యూటీ, స్థానికపన్నులు అదనం)

నాణ్యతకు సంకేతాలు
SYMBOLS OF EXCELLENCE




సమీపంలో ఉండే యు. యం. యస్. డీలరును ఒక్కమారు చూడండి—
ఎలక్ట్రో పి. 16 రేడియో మీకు ఎల్లవేళలా స్వాగతం ఇస్తుంది.

**U. M. S. RADIO FACTORY** COIMBATORE-1

## మనలో మాట

ఈ వారం 28-29 పేజీలలో ప్రారంభం అయే కొత్త సీరియల్ రచయిత శ్రీ హారికిషన్ మా పాఠకులకు కొత్తవారు కారు. వీరు రచించిన 'హృదయ కుసుమాలు' నవలను కొన్ని నెలల క్రితమే ప్రచురించాము. అంతకు పూర్వం కూడా 'సచిత్ర వార పత్రిక'లో వీరి రచనలు ప్రచురింపబడ్డాయి. ప్రస్తుతం వీరు విజయవాడలో పని చేస్తున్నారు...

శ్రీ భూపతి రచన, పెద్ద కథ అయిన సాఫల్యం యీ వారంతో ముగుస్తున్నది. మరో సీరియల్ ప్రచురణ త్వరలో ప్రారంభించగలమనుకుంటున్నాము.

* * *

భారతీయ బృందం తొలిసారిగా ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిందన్న వార్త తుదిక్షణంలో అందింది. ఈ అధిరోహణ కార్యక్రమానికి ఎంతో చరిత్ర వున్నది. ఈ వారం 6వ పేజీలో వేసిన వార్తకు తోడు, వచ్చేవారం యీ అంశాన్ని సమీక్షించే చిన్న వ్యాసం కూడా వెయ్యగలమని ఆశిస్తున్నాము.

* * *

అణ్వస్త్రాలకు సంబంధించినదీ, పాఠకులు బహుశా ఊహించలేనిదీ ఒకటి జరుగుతోంది. ఆ వివరాలన్నీ సచిత్రంగా వచ్చే సంచికలో చూడవచ్చును. ఇదే పేజీలో ప్రకటన కూడా వేశాము.

* * *

వివిధ ప్రాంతాల వింతలను గురించీ, విశేషాలను గురించి రచయిత్రులు ఎక్కువగా వ్రాస్తున్నారు. వీటితో బాటు, నిత్యజీవితంలో ఎదురయే సమస్యలను స్త్రీల దృక్పథం నుంచి వ్రాసే రచనలకు సచిత్ర వార పత్రిక స్వాగతం ఇస్తున్నది.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : "దేవత"లో సావిత్రి.



ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 4—6—'65
విశ్వావసునామ సం॥ జ్యేష్ఠ మాస శుద్ధ పంచమి
సంపుటము · 57 సంచిక 40

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

### చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

| | |
|---|---|
| విడిప్రతి | 30 పై. |
| సంవత్సర చందా | 15.60 పై. |
| 6 మాసాల చందా | 7.80 పై. |

ఏమవుతుంది?

★

అణ్వస్త్రాలతో యుద్ధం జరిగితే...?

★

వచ్చే సంచికలో సచిత్ర వ్యాసం

## కథలు

మన 7—5—65 సంచికలో ప్రచురించిన "శృతి తప్పిన వీణ" పలికిన అపశృతులు వన్నీ వాక్యాలు వ్రాయిస్తున్నాయి. కథ అంటే నిర్వచనం తెలుసుకోవడం మంచిది. గొప్ప భాష వ్రాద్దామని "నైరాశ్యత", "విశృంఖలత" వంటి శబ్దాలతో నింపడం. "నవ్వును ఆపుకోలేక కిలకిలలాడింది" అంటే అర్థమేమిటో! పైగా ఆ నవ్వుకు కారణాలుగా వ్రాసిన వాక్యాల్లో హాస్యంలేదు. "కొన్ని క్షణాలు మట్టిలో కలిసినయ్" వంటివి వివరీత ప్రయోగాలు.

ఇటువంటి కథలే ఎక్కువగా వస్తున్నాయి ఈ రోజుల్లో. ఏదో వ్రాద్దామనే ఆవేశంలో అసమగ్రంగానూ, హాస్యాస్పదంగాను వ్రాస్తున్నారు ఎక్కువమంది. వస్తువులో నవ్యత, భాషలో ప్రత్యేకత లేకపోగా అసభ్యత, అశ్లీలత మునురుకుంటున్నాయి. వైవిధ్యంలేదు. నైరాశ్యం, నిర్లిప్తత, వైరాగ్యం, గాంభీర్యం ఇటువంటి మాటలు సందర్భరహితంగా ఉపయోగించడంలో దొరసానికి చీర కట్టినట్టు అసహ్యంగా తయారవుతోన్నాయి. సృజనాత్మకమూ, నిర్మాణాత్మకము అయిన కథలు (మంచి భాషలో) ఎప్పుడోగాని దొరకడంలేదు. ఇంకా కొంతమంది కొత్తదనం పేరుతో నైతిక మూల సూత్రాలనే విడిచివేస్తున్నారు. ఇప్పటి రచనల్లో కొట్టవచ్చినట్లుగా కనిపించే అంశం పాత్రల హృదయ దౌర్బల్యం. అది రచయిత హృదయాన్ని ప్రతిబింబిస్తుంది.

ఇందులో రచయితలకన్న సంపాదకుల బాధ్యత ఎక్కువ. వారు ఇటువంటి బజారు భావాలకు, చవకబారు సాహిత్యానికి ప్రోత్సాహం ఇవ్వకుండా ఉంటే ఇది బయటకు వ్యాపించదు.

ప్రజల భాష ప్రజల కర్థమయ్యేలా వ్రాయాలి అనే నినాదం ప్రబలంగాఉంది. దానికర్థం ప్రజలు మంచి స్థాయిలో లేకపోతే మనం దిగజారడంకాదు వారిని ఆ స్థాయికి తీసుకు రావాలి.

మనకు అమోఘమైన సంస్కృతి, చరిత్ర, భాష ఉన్నాయి. అవన్నీ తెలుసుకోవాలి. మన జాతి ఇంత ఉన్నతికి రావడానికి దోహదం చేసిన విషయాలు మనం విడిచిపెడితే పతనంతప్పదు. మౌలిక సూత్రాలు, ప్రాథమిక భావాలు, మన భాషలో, భావంలో, ప్రవర్తనలో వివిధ సాహితీ ప్రక్రియల్లో అంతర్వాహినిగా ప్రవహించినప్పుడే మనకు ఉన్న ఆ ప్రత్యేకత.

కొంతమంది సోదర, సోదరీమణులు అద్భుతమైన కథలు వ్రాస్తున్నారు. వారికి నా హృదయపూర్వక అభివందనాలు.

పారుష్యాలకు క్షంతవ్యుణ్ణి.

వెంకటాచారి (విశాఖపట్నం)

## సీరియల్ కథ

త్రివేణిగారు కన్నడంలో రచించినది అచ్చం అలాగే ఒక మాట కూడ విడవకుండా అనువాదం చేసిన శర్వాణిగారికి నా అభివందనలు. కాని అపస్వరం (2వ భాగము) "అపజయము"కూడ తర్జుమా చేసి ప్రచురించివుంటే, పాఠకులకు ఇంకా ఆనందం కలిగేది. మొదటి భాగములో శామణ్ణపై జాలి కలుగుతుంది. కాని 2వ భాగములో మీరాపై జాలి కలుగుతుంది. 2వ భాగము అపజయము కూడా ప్రచురించవలెనని కోరుతున్నాను. కన్నడంలో ఒకమారు చదివాను. ఇప్పటికీ పత్రికలో అదే

# ఉత్తరాలు

కథ ప్రచురిస్తుంటే చదవకుండ ఉండలేక పోయేను. కథ చాలా బాగుంది.

చింతా శ్యామల (బళ్ళారి)

## వ్యాసాలు

పవన వేగాన్ని ధిక్కరించ ప్రయత్నిస్తున్న భారత "పరుగు పందెం" యోధులను గూర్చి 30—4—65 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ముచ్చటించుట మిక్కిలి ముదావహము. కాని "క్రీడల" విషయంలో మన ఆంధ్రదేశం చాలా వెనుకబడి ఉందని చెప్పుటకు సిగ్గుపడుతున్నాను. విద్యాసంస్థలుగాని, యితర వ్యాయామ క్రీడా సంస్థలుగాని యువకులకు తగిన శిక్షణ ప్రోత్సాహం ఇస్తున్నట్లు కనబడదు. అంతర్జాతీయ స్థాయిలో కాకపోయినా జాతీయ స్థాయిలో జరిగే పోటీలలో ఆంధ్ర క్రీడాకారులు పాల్గొనుట చాలా అరుదు. నేను ఆంధ్రదేశంలోని ఒక పెద్ద పట్నంలో ఒక పేరుబడ్డ విద్యాసంస్థలో చదువుకున్నాను. కాని నా విద్యార్థిదశలో నాకు క్రీడలలో ఆసక్తివున్నా నాకు ఎట్టి ప్రోత్సాహము అవకాశము లభించలేదు.

బెంగాల్ దేశములో అబాల గోపాలము క్రీడాకారులే. ప్రతివోటా, ప్రతి ఇంటా క్రీడా విశేషాలే ముచ్చటిస్తారు. ఈ వాతావరణం నాకు ఎంతో ప్రోత్సాహకరముగా కనిపించి కృషిచేసి ఈ 35 సం. ల వయస్సులో ముగ్గురు బిడ్డల తండ్రినైన నేను 100, 200, 400, 800 మీ. పరుగులు, 100 × 4, 200 × 4 రిలే జట్టులోనూ పాల్గొని కొంతవరకు విజయం సాధించి బహుమతులు పొందగలిగేను. ఉన్నతశ్రేణి క్రీడాకారులు క్రీడారంగాన్ని విరమించే వయస్సులో నేను ఎంత కృషి చేసినా జాతీయస్థాయిని, అధమం రాష్ట్రీయ స్థాయిని చేరుట కూడా కష్టసాధ్యమైన విషయమే.

ఈ వ్రాసిన వాక్యములు బరువెక్కిన హృదయంతో బాధతో వ్రాసినవికాని నా స్వంత డబ్బా వాయించుకోడానికి వ్రాసినవికావని పాఠక మహాశయులందరూ సానుభూతితో నా బాధను అర్థం చేసుకోగలరని ఆశిస్తున్నాను. కనుక ఉత్సాహవంతులైన యువ క్రీడాకారులకి ప్రభుత్వం, విద్యా సంస్థలు, ఇతర క్రీడా సంస్థలు ఏటేటా విరివిగా పోటీలు జరిపి తగిన అవకాశములు కల్పించి అంతర్జాతీయ పోటీలలో కాకపోయినా కనీసం జాతీయ స్థాయిలో జరిగే పోటీలలోనైనా అత్యధిక సంఖ్యలో ఆంధ్రులు పాల్గొనే ఏర్పాట్లుచేసి, ఉన్నత ప్రమాణాలు సృష్టించుటకు అవిరళమైన కృషి చెయ్యాలి యువకులకు క్రీడలలో తరిఫీదునిస్తే, క్రీడా పోటీలలో పాల్గొనుటవలన క్రమశిక్షణ, జాతీయ సమైక్యత మొదలైన లక్ష్యములను సులభముగా సాధించగలుగుతాము

చాగంటి సింహాగిరీశ్వరరావు (కలకత్తా)

## తోటమాలి

"తోటమాలి" అనే వ్యాసము నిజంగా మానవత్వంగల వారందరిలోనూ, ఆ తోటమాలిపై సానుభూతిని కలుగజేస్తుంది. ఆ కష్టజీవి వాస్తవ గాధ చదువుతుంటే నా మనస్సులో సంచలనం వాన్నే లేపింది.

ప్రస్తుత పరిస్థితులలో 200 రూ.లు వచ్చే ఉద్యోగస్థులకే జీవితము కష్టంగా సాగుతుంది. అటువంటి పరిస్థితులలో 70/— రూ. ల జీతంతో పదిమందిగల కుటుంబాన్ని పోషించటం కష్టమే.

ఇటువంటి వ్యాసాలు వేసి దీనుల కష్టాలు అందరికీ తెలియజేస్తున్నందుకు నా కృతజ్ఞతలు.

పి. సువిశ (విడమనూరు)

## న్యూఢిల్లీ లేఖ

7—5—65 ఆంధ్రసచిత్ర వారపత్రికలో శ్రీ కృష్ణగారి న్యూఢిల్లీ లేఖ సమంజసముగా లేదని తెలుపుటకు చింతించుచున్నాను. ప్రధాని శాస్త్రి అమెరికా పర్యటనపై జాన్సన్ సూచించిన వాయిదాను రద్దుగా పేర్కొనడమేకాక దానిని ఉద్రిక్త పరిస్థితిగా ఉత్ప్రేక్షించారు. ఈ వాయిదాకు జాన్సన్ పేర్కొన్న కారణాలను పరిశీలించక, భారతదేశానికి ఆర్థిక, రాజకీయ రంగాల్లో ఎంతో సహాయంగా ఉన్న అమెరికాను తీవ్రంగా విమర్శించడం పూర్తి అసమంజసం. ఇది కొంత అసభ్యత అనడానికి సందేహమేమీ లేదుకాని ఇట్టి సాత్త్విక విమర్శన ఆహ్వానించదగ్గదికాదు ..తోటి దేశాల్లోనే మవునం వహించడం ఒకరకంగా మంచిదన్న శ్రీ కృష్ణగారి ఊహ పూర్తిగా అవకాశ వాదానికి చెందుతుంది. స్థిరమైన ఆదర్శంపై కొనసాగుతున్న మన విదేశాంగ విధానం ఇట్టి స్వల్పపు గాలి తాకుడులకు మార్చుకోదగ్గది కాదు. వారు ప్రస్తావించిన తక్కిన విషయాలు కూడా సోపపత్తికములు కావు.

ఆర్. వెంకటరెడ్డి (న్యూఢిల్లీ) ★

# శిఖరానికి నిచ్చెనలు...

ఇరవై తొమ్మిది వేల, ఇరవై ఎనిమిది అడుగుల ఎత్తున వున్న ఎవరెస్టు శిఖరాన్ని భారతీయ బృందం గురువారంనాడు తొలిసారిగాను, శనివారంనాడు రెండవసారి అధిరోహించింది. ఈ శిఖరాన్ని భారతీయబృందం చేరుకొనటం ఇదే తొలిసారి.

గురువారంనాడు వెలువడిన తొలివార్తల ప్రకారం అదే రోజున వుదయం 9-30గంటలకు భారతీయ బృందం లెఫ్టినెంట్ కమాండర్ యం. యస్ కోహ్లి అధ్వర్యాన శిఖరానికి చేరుకొన్నది. ఈ బృందంలో శిఖరాగ్రానికి చేరుకున్న వారు మాత్రం ఇద్దరే

పందొమ్మిదిమంది సభ్యులున్న బృందం ఇది. ఇండియాకు యీ గౌరవం లభించటం తొలిసారే కాని, ఇంతకు పూర్వం మూడు విదేశీ జట్లు ఇదే గౌరవాన్ని సంపాదించుకొన్నాయి. గురువారంనాడు శిఖరాన్ని చేరుకున్న ఇద్దరు సభ్యులు, వెంటనే భారతీయ జండానొకదాన్ని, నేపాల్ జండానొకదాన్ని ప్రతిష్ఠించారు అక్కడ అరగంట వున్న తరువాత తిరిగి 'కాంప్'కు వచ్చేవారు మార్గమధ్యంలో తుఫాను గాలి కూడా వీరిని కొంతసేపు పరీక్షించింది.



శ్రీ కోహ్లి

ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన భారత పర్వతారోహకదళం నాయకుడు.



కెప్టెన్ ఎ ఎస్ ఛీమా

ఈయన శ్రీ నవాంగ్ గోంబూతోపాటు మొదటి ఎవరెస్ట్ శిఖరోహక దళంగా ఏర్పడి మేనెల 20వ తేదీ ఉదయం 9—30కు ఎవరెస్ట్ శిఖరం చేరారు

ఈ బృందానికి ఒక ప్రత్యేకత వున్నది. కారణం ఏమంటే శిఖరాన్ని చేరుకున్న తొలి భారతీయ బృందం ఇదే. అంతకు ముందు వెళ్లిన బృందాలు తమ ప్రయత్నంలో విఫలమయ్యాయి. ఏమయినా ప్రపంచంలో తొలిసారిగా దీన్ని అధిరోహించిన ఘనత, సర్ ఎడ్మండ్ హిల్లరీ, షెర్పా టెన్సింగ్ నార్కేలకు కొన్ని సంవత్సరాల క్రితమే లభించింది.



శ్రీ నవాంగ్ గోంబు

కాప్టెన్ ఎ ఎస్ ఛీమాతోపాటు మేనెల 20వ తేదీన ఉదయం 9—30కు ఎవరెస్ట్ శిఖరం అధిరోహించిన పర్వతారోహకుడు

## ద్వితీయ విజయం

పోయిన గురువారం నాడు వెలువడిన తొలివార్తలు సద్దుమణగక పూర్వమే యీ బృందంలోని మరో ఇద్దరు సభ్యులు ఎవరెస్ట్ శిఖరాన్ని రెండోసారి చేరుకోవటం ద్వారా ద్వితీయ విజయాన్ని సాధించారన్న వార్త అందరినీ ఆశ్చర్యంలో ముంచివేసింది. ఈ ఇద్దరు సభ్యులు 50 నిమిషాలసేపు పై శిఖరం మీద వున్నారట

ఎవరెస్టు శిఖరం అధిరోహించారన్న వార్త అన్ని వర్గాలలోనూ సంతోషాన్ని కలిగించింది

రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ స్వయంగా రెండు మార్లు అభినందన సందేశాలను పంపారు బృందంలో సభ్యులయిన అందరి ఆరోగ్యం బావుంది.




శాస్త్రి పర్యటన వాయిదా!
- ఫలాఫలాలు
అమెరికా
రష్యా
ఇండియా తో
సత్సంబంధాలు


ఎస్ ఎస్ పి. లో
లోహియా ఐక్యం
జోషి
లోహియా
ఎస్ ఎస్ పి


అసలు కథ ఇది!
అయూబ్
చైనా
విల్సన్ కు
జవాబు


ఆలీఘర్
విశ్వవిద్యాలయం
మతోన్మాదానికి
సవాల్
ఆర్డినెన్సు

## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతి రచనతోనూ దాని రచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంత రచనేననీ, దేనికీ అనుకరణ కాదనీ, హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించ లేము.

సంపాదకుడు

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

ర్వాత కాల్షియం అమోనియం నైట్రేట్ గడకం కూడా పెరిగేటందుకు వీలుగా ర తగ్గించబడింది. అమోనియం సల్ఫేట్ న్నా దాని ధర టన్నుకు రు. 50/— తక్కువ ంటుంది. జనవరి, 64 నుంచీ యూరియా ధర వాడా టన్నుకు రు. 100/— ప్రత్యేక తగ్గింపు మలులోకి వచ్చింది. ఫాస్ఫేటిక్ ఎరువులపై 25% సబ్సిడీ లభిస్తుంది. దీన్ని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు చెరిసగం భరిస్తాయి. శించిన ఉత్పత్తి స్థాయిని చేరుకోటానికి, మంచి ఫలితాలతో ఎరువుల వాడకం పెరగటానికి వ్యవసాయదారులకి ధరలను తగ్గించి అందు బాటులోకి తేవటం ఎంతైనా అవసరం. ఆధునికమైన ఫాక్టరీలు తయారైన తర్వాత ఉత్పత్తి తగినంతగా పెరిగి ధర తగ్గటానికి అవకాశం ఏర్పడుతుంది

ఈ పథకం విజయవంతం కావటానికి కొన్ని పరిస్థితులు అనుకూలించాలి. రసాయనిక ఎరువుల వాడకాన్ని విస్తృతం చేయటానికి సరైన ధరలను నిర్ణయించాలి. ఉత్పత్తి రంగంలో - ఫాక్టరీలకు సకాలంలో కావల్సిన ముడిపదార్థాలు లభించాలి. ఫాక్టరీలు సక్రమంగా నిర్వహింపబడటానికి సరైన దిగుమతి సౌకర్యాలు ఉండాలి. పటిష్టమైన కార్యనిర్వాహక రంగం ద్వారా ఎరువులు వ్యవసాయదారులకు సక్రమంగా పంపిణీ జరగాలి. ఎరువులువేసే కాలానికిగానీ, ముందుగా గానీ వ్యవసాయదారుని చేతి కందుబాటులో ఉండేలా నిల్వలను ఉంచాలి. ఎరువులను నిల్వచేసే గోడవున్లను దేశంలో అనేక చోట్ల ముఖ్యంగా రవాణా సౌకర్యాలు లేనట్టి ప్రదేశాల్లో కట్టాలి. కొనుగోలుదారునికి అప్పులను యిచ్చే ఏర్పాట్లను చేయటం కూడా అత్యావశ్యకమైన విషయం.

1964—65 లో ఎరువుల వాడకాన్ని రెట్టింపు చేయటానికి రవాణా సౌకర్యాలు ఎక్కువగా తోడ్పడ్డాయని అనుభవపూర్వకంగా తెలిసింది. కావలసిన పరిమాణాల్లో ఎరువులను ఎలా వాడాలో వ్యవసాయదారుడు తెల్సుకునేలా చేయాలి. ఎరువుల వాడకం ద్వారా అతను పొందే లాభాన్ని కూడా అతని దృష్టికి తేవాలి. వ్యవసాయదారుల క్షేత్రాలలో ప్రయోగాలు చేసి వాటిఫలితాలను ప్రదర్శించే విధానం విస్తృతం చేయబడాలి. ఈ ప్రదర్శనల్ని ఏయే భూమి ఏరకమైన

## న్యూఢిల్లీ లేఖ

పంటలు పండించటానికి అనుకూలంగా ఉంటుందో, ఏటివనతి, ఎలాంటి ఎరువులు యే పంటకి వేయాలనే విషయాల్ని తెలియజేస్తాయి. భూసార పరిశోధన కేంద్రాలను విస్తృతం చేసి పరిశోధనల ఫలితాలను ప్రదర్శించాలి. ఈవివరాలన్నీ ఒకచోట

54 వ పేజీ చూడండి


లవ్ మ్యారేజ్
ఎక్స్-రే (మనస్సుల్లో)


నేను ఎంత అందంగా ఉండబట్టే కట్నం లేకుండా చేసుకున్నారు


'బోడి అందం ప్రేమట. కట్నం దమ్మిడీ రాలేదు


నా మాట విని 'సుబ్బారావు' కూతుర్ని చేసుకొంటే ఆస్తంతా వచ్చేది!
వెధవ....
ప్రేమ....


నా ప్రేమ యాత్ర విజయ-వంతం.
-మ్యూజిక్


ఈ గిరికి నా షైలా నాకు దక్కనివ్వలేదు రాస్కెల్....


మా అమ్మాయిని కాదని ఆ అమ్మాయిని చేసుకొన్నాడు. ఏం లోపం మా అమ్మాయికి


ఇంకా చూపించమంటావా ఎక్స్-రేలు.


వద్దు బాబోయ్


ఇదివరకులా చూస్తుంటే ప్రేమంతా ఏమయ్యిందో?
లత-

# ప్రేమప్రియ

'రంగధామ్'



మానవుడి జీవితంలో చాలావరకూ ఆపదలకు మూలకారణం 'ఊహ' మాత్రమే అన్నారు పెద్దలు ఈ భావనాశక్తి, అసలుండ కూడదని అనలేదుగాని, తగు మాత్రంగానే ఉండాలని అతిగా వుండ కూడదని చాలామంది అభిప్రాయం. తగు మాత్రం అంటే, సుబ్బారావు అనే ఇరవైయ్యేళ్ల యువకుడికి, తను భవిష్యత్తులో చాలా గొప్పవాడినవుతాననే నమ్మకంతో బాటు, తనకు కాబోయే భార్య తన కాలేజీలో మొదటి సంవత్సరం బి. యస్. సి. చదువుతున్న మంజులత అవుతుందని, అసలు మంజులతేననీ, మధురమైన భావనలతో పరవశించి ఆనందించే వరకూ బాగానే వుంటుంది. అసలు యవ్వనంలో ఈ భావన చాలాముఖ్యం.

కాని భావనారాయణ అనే ఏభైయ్యేళ్ల వ్యక్తికి మాత్రం ఇది చాలా ఆపదలు తెచ్చి పెట్టింది! ఆయన కెంతసేపూ ఎదుటి వ్యక్తి తనని గురించి ఏమనుకుంటూ వుంటాడా? అన్న ఆలోచనా, బహుశా ఈవిధంగా (తరుచూ చెడ్డగానే) అనుకుంటూ వుంటాడనే ఊహా, నిరంతరం బాధిస్తాయి. ఆయన స్థితిపరుడు. పండితుడు. పుస్తకాల షాపు పెట్టుకుని కాలక్షేపం చేస్తున్న, సన్నని పొడుగాటి పెద్దమనిషి కళ్లజోడు కూడా పెట్టాడు. జీవితంలో ఏలోటూలేదు ఆయనికి కాని పొద్దున్నే కూరగాయలమ్మే వాడో, పాలుపోసేవాడో, మరెవడొచ్చినా ఆయనకి, 'వీడు తన గురించి ఏమనుకుంటాడా?' అన్న ఆలోచనే బాధిస్తూంటుంది.

“వంకాయలు వీశ అరరూపాయకిస్తావా?” అని ఆయన అడుగుతే, వాడు “లేదు బాబయ్యా, కిట్టదు అర్ధరూపాయికి తక్కువివ్వను” అంటే ఆయన, “అయితే నీ వుద్దేశం ఏమిటి? నేనేం తెలివి తక్కువవాణ్ణనా, పేదవాణ్ణనా, అసలు వంకాయ అంటే ఎలా వుంటాయో తెలియని వాణ్ణనా, ఏమిటి నీ వుద్దేశం?”అని అడుగుతాడు.

దానికి వాడు, “అదేటి బాబయ్యా అలాగంటారు. తమ బోటి మారాజులకు బేర మాడ్డమేటనిగాని, వంకాయలే యెరుగరా!” అంటాడు అలాంటప్పుడు ఆయన కాస్సేపు బేరమాడి కొంటారే గాని, వాడు వెళ్లి పోయిం తరువాత, వాడు తన్ను గూర్చి ఏమనుకుంటాడా? అని గంట సేపటి

బాగా ఊహిస్తూ కూచుంటారు. ఇహ ఇంట్లో భార్యను చీటికీ మాటికీ, "ఏమేవ్, నాగురించి నీ ఉద్దేశమేమిటో చెప్పు?" అని అడిగి "ఆ, ఏడిక్కడ దాపురించాడురా బాబూ, నా పాలిటికి యముడి లాగున్నాడు. అనుకుంటున్నావా? అనుకో, అనుకో" అని అనడం దానికావిడ, "ఇదేం ఖర్మండీ, మీ గురించి అలా ఎందు కనుకుంటాను" అని ఆవిడ అనడం మామూలు. కాని ఆ జవాబుతో ఆయనకు తృప్తి వుండదు. తీరిక వున్నప్పుడల్లా తన భార్యాబిడ్డలు తనగురించి ఏమను కుంటారా? అని ఆలోచిస్తూనే వుంటారు. అటువంటి భావన్నారాయణగారి పుత్రికా రత్నమే మంజులత.

అసలు మంజులతని సుబ్బారావు ప్రేమించడం ఎలా తటస్థించిందీ అని వాళ్ల డైరీలు గనుక తిరగేసి పరిశీలిస్తే, ఒకకొత్త విషయం మనకు బోధ పడుతుంది. అదేమిటంటే సుబ్బారావు తమ్ముడైన కిష్టిగాడు, యస్. యస్ యల్. సీ మూడోసారి కూడా తప్పాక, మెట్రిక్‌కు కట్టించడం కోసం ఆశీర్వాదం మాష్టారితో వాడి గురించి మాట్లాడడానికి సుబ్బారావు బయల్దేరిన రోజే అతని జీవితంలో స్వర్ణాక్షరాలతో లిఖించ బడవలసినరోజు. సుబ్బారావు, ఆశీర్వాదం మేష్టారింటికి రావడమేమిటి, తక్షణం "రావోయ్ నీ కొక శుభవార్త చెప్తాను" అని మేష్టారనడమేమిటి, వెంటనే సుబ్బారావు మనసులో ఒక ఆనందరేఖ మెరిసింది.

"ఏమిటో త్వరగా చెబుదురూ, దంపక" అన్నాడు సుబ్బారావు, ఆయన కెదురుగా కుర్చీలో కూచుంటూ.

"మన వీధికి ఒక కొత్త కళ వచ్చింది. ఇహ నుంచీ మనవీధి బాగు పడుతుంది మనమంతా మునుపటిలా, మాసిన బట్టలూ, పెరిగిన గడ్డం మానేసి, ఇస్త్రీబట్టలు తొడుక్కుని రోజుకోసారి గడ్డం గీసుకోవచ్చు. మునుపు మనవీధిలో అట్టే 'ట్రాఫిక్కు'లేదు. ఇహ నుంచీ ఆ బెంగ వుండదు. పదహారేళ్లు దాటిన ప్రతివ్యక్తీ, తక్కిన వీధులన్నీ మానేసి విధిగా ఈవీధివెంట, కనీసం రోజుకు రెండు సార్లయినా తిరుగుతాడు ఆఖరికి రోడ్లు తుడిచేవాళ్లు కూడా మునుపటి కన్నా శ్రద్ధగా తుడుస్తారు" అని ఆశీర్వాదం మేష్టారు చెప్తూంటే సుబ్బారావు కేమీ బోధపడులేదు.

"ఏమిటి మాష్టారూ విశేషం ?" అనడిగాడు తెల్లబోతూ.

నలభై ఏళ్ల ఆశీర్వాదం మాష్టారు సుబ్బారావుని చూసి చిన్న చిరునవ్వు నవ్వారు. అందులో చాలా అర్థం ఉంది. ఇంకా వివరించి చెప్పాలా ? అన్న అర్థం ఉంది కాని, నిరంతరం స్కూల్ ఫైనల్ ఫేలయిన కుర్రాళ్లకు ట్యూషన్ చెప్పడం అలవాటయిన ఆయనకు సుబ్బారావు అజ్ఞానం అంత వింతగా కన్పించలేదు.

"అబ్బాయి, నువ్వీమధ్య బొత్తిగా నీ రూపం గురించి అశ్రద్ధ వహిస్తున్నావు ఇహనుంచి అదేమి కుదరదు ...." అని ఆయన, అంటూండగానే సుబ్బారావు గబుక్కున కుర్చీలోంచి వీధిలోకి ఎగిరాడు. సరిగ్గా అదే సమయంలో ఎదురింట్లో మంజులత మెరిసింది. సన్నగా, బాజాగ్గా పరికిణీ వోణీలో, అందమైన పదహారేళ్ల ఎర్రని మంజులత వెంటనే ఇంట్లోకి మాయమైంది. ఆశీర్వాదం మాష్టారు పిలుస్తున్నా వినిపించుకోకుండా సుబ్బారావు తన యింటికి పరిగెత్తాడు. అరగంట తర్వాత స్నో, పౌడర్ల సహాయంతో, బాగా తెల్లబడ్డ సుబ్బారావు అద్దం ఎదురుగా నుంచుని తన జుట్టు దువ్వెన సహాయంతో పాలిష్ చేస్తూంటే, అతని తల్లి "ఒరే కిష్టిగాడి ప్రవేటు సంగతి కనుక్కున్నావురా ?" అని అడిగింది.

"ఇదుగో వెళ్తున్నా" అని మళ్లీ ఆశీర్వాదం మాష్టారింటికి పరిగెత్తాడు. అప్పుడు, హోంవర్కు శ్రద్ధగా చేసిన కుర్రాణ్ణి మెచ్చుకున్నట్టు, అతన్ని మెచ్చుకున్నారు మేష్టారు.

కిష్టిగాడి విషయం రెండు నిముషాలలో మాట్లాడడ మయ్యాక సుబ్బారావు ఎదురింట్లో క్రొత్తగా దిగిన భావనారాయణగారి గురించీ, ఆయన ముద్దులపట్టి మంజులత గురించీ బోలెడన్ని విషయాలు మేష్టారిగారితో చర్చించాడు. ఆ క్షణంనుండీ, సుబ్బారావు మంజులతని రోజూ ఒకటి, రెండుసార్లు చూస్తూండడం ప్రారంభించాడు. ఆమె అందం అతన్నాకర్షించింది. ఆమె ఆయేడే స్కూలు ఫైనలు పాసయ్యింది. ఆమె మరుసటి సంవత్సరం కాలేజీలో చేరి, పి. యూ. సీ లో చదువుతూంటే కాలేజీలో పెద్ద అలజడి లేచింది, ఆమె ఆరాధకుల సంఖ్య అసంఖ్యాకంగా పెరిగిపోయి. కాని వీరిందరి ఆరాధన ఒక ఎత్తు, సుబ్బారావుయొక్క ప్రేమ ఒక ఎత్తు. అతను మంజులతను మనసారా ప్రేమించాడు. ఆమెకోసం ఏ త్యాగమైనా చేయదల్చుకున్నాడు.

ఒకే వీధిలో ఉండడంవలన సుబ్బారావుకీ, భావనారాయణగారికీ త్వరలోనే పరిచయం ఏర్పడి అది స్నేహం క్రింద మారింది. తరుచూ సుబ్బారావు, వాళ్లింట్లో కాలం గడప నారంభించాడు. కొన్నాళ్లకి మంజులతతో కూడా అప్పుడప్పుడు మాట్లాడడం ప్రారంభించాడు. మంజులకి కూడా సుబ్బారావంటే ఇష్టం ఏర్పడింది. సుమారు ఏణ్ణర్థం కష్టపడి, మంజులత అభిమానం సంపాదించుకొన్న సుబ్బారావుకి హఠాత్తుగా ఒకనాడు, తన ఆశాసౌధం, గాలిలో అల్లల్లాడుతున్నట్లూ, తను తగిన శ్రద్ధ వహించకపోతే, అది కాస్తా కూలిపోయేటట్లూ, అనుమానం వేసింది. దానికి కారణం, అదే వీధిలో ఉంటున్న రామారావు అనే యువకుడు.

అసలు రామారావూ, సుబ్బారావూ స్నేహితులు. రామారావు చదువు ముగించి, కాలేజీలో ఆయేడే డిమాన్‌స్ట్రేటరుగా చేరాడు. ఎర్రగా, బొద్దుగా ఉన్న ఇరవై రెండేళ్ల యువకుడు. సుబ్బారావు, నల్లగా, పొట్టిగా ఉంటాడు. రామారావు కూడా మంజులతను ప్రేమిస్తున్నాడని సుబ్బారావుకి తెలియదు. కానీ రామారావు సుమారు ఏడాదినుండీ సుబ్బారావు పడుతున్న అవస్థంతా గమనించి, తను సూక్ష్మంగా, సులభంగా మంజులతను దక్కించుకోవాలని 'ప్లాను' లేస్తున్నాడు. రామారావు, భావనారాయణగారి స్వభావం కనిపెట్టాడు. ఆయనలోని బలహీనత, ఎంతసేపు ఇతరులు తన గురించి, మంచిగా గొప్పగా అనుకోవాలనే కోరిక అనీ, అందువలన తరుచూ ఆయనను పొగిడితే ఆయన కిష్టమనీ తెలుసుకున్నాడు. వాళ్లిద్దరూ కలుసుకున్నప్పుడు, భావనారాయణగారు, "ఓహో రామారావు ! రా ! కాస్సేపు కూర్చో" అని ఆదరంగా పిలుస్తారు. రామారావు చాలా హుందాగా ఆయన కొట్లోకెళ్లి కూచుంటాడు. ఒక నిముషం మౌనంగా కొట్టంతా పరిశీలిస్తాడు.

తరువాత, "అసలు మీ తత్వం చూస్తూంటే నాకు చాలా ఆశ్చర్యం వేస్తుంది. బ్రహ్మాండమైన బుద్ధి కల మీరు, ఇంత చిన్న వ్యాపారంతో తృప్తి పడిపోవడం నాకు నచ్చలేదు. మీరు తల్చుకోవటం లేదు గాని మీరే గనక తల్చుకుంటే ఎంత వ్యాపారమైనా చేసేసి బోలెడంత డబ్బు గణించగలరు" అని ప్రారంభిస్తాడు రామారావు తీరికగా కూర్చుని.

ఎండి, వాడిపోబోతున్న మొక్కకు నీరుపోస్తే, అది మళ్లీ చిగిర్చినట్లు, ఈ పొగడ్తతో భావనారాయణగారు, వికసించిన మొహంతో, చిరునవ్వుతో "ఆ! నా కంత వోపికేది. అందులోనూ బద్ధకం జాస్తి. అందువలన అలా ఈడ్చేస్తున్నాను. అయితే నీ ఉద్దేశంలో, నాది చాలా గొప్ప మేధాశక్తి అంటావు. అది సరే ననుకో. చాలామంది నన్నర్థం చేసుకోలేక తికమక పడిపోతారు. అసలు మాయింట్లో వాళ్లే నన్నర్థం చేసుకోలేరు" అని ఆయన చెప్తూంటే ఒక ముసలాయన వచ్చి "తిలక్‌గారి గీతా రహస్యం ఉందా ?" అని అడుగుతాడు. వెంటనే భావనారాయణగారు, గీతా రహస్యం తన వద్ద లేకపోయినా, ఆ వచ్చినాయనని పది నిముషాలు నిలబెట్టి తన దగ్గర ఉన్న భక్తి, వేదాంత గ్రంథాలన్నీ చూపించి చివరికి రాజాజీగారి భారతాన్ని అంటగట్టి పంపిస్తాడు. ఆ ముసలాడు వెళ్లిపోగానే రామారావు, "భలేవారండి ! మొత్తానికి ఆయనచేత పుస్తకం కొనిపించేశారు" అని ఆయన్ని మళ్లీ పొగిడి, కాస్సేపు అలాటి మాటలే చెప్పి వెళ్తాడు భావనారాయణగారు, రామారావంత బుద్ధిమంతుడు లేడనే నిర్ణయానికి వచ్చారు. ఆమాట సుబ్బారావుతో అన్నారు కూడాను.

అది విన్న దగ్గర్నుంచీ సుబ్బారావుకి తిండీ, నిద్రా పడిపోయాయి. రామారావు ఉద్దేశాన్ని సుబ్బారావు పసిగట్టాడు. భావనారాయణగారికి రామారావుమీద అంత మంచి అభిప్రాయం ఎలా కలిగిందో సుబ్బారావుకి బోధపడలేదు. తనకన్నా రామారావు అందముగా కూడా ఉంటాడు. కానీ, ఈ లోకంలో అందానికి మాత్రమే ప్రాముఖ్యత యిచ్చేటట్టయితే తనలాటివాళ్ల గతేంగాను ? సృష్ట్యాదినుంచి వస్తూన్న శ్వేతజాతి, నల్లజాతి అనే ఘోర విచక్షణకు దారుణంగా తన ప్రేమ బలై పోవలసిందేనా ! అంతేకాక రామారావు తియ్యగా కబుర్లు చెప్తాడు. ఆ కబుర్ల మాయలో పడి మంజులత కూడా రామారావు మీద ఎక్కువగా శ్రద్ధ చూపిస్తోంది. రెండు రోజుల నుండీ తను వాళ్ళింటికి వెళ్లినప్పుడల్లా, రామారావు గురించే గొప్పగా చెబుతోంది. అతనిచ్చిన బహుమతుల్ని, అంటే ఒక సెల్యులాయిడ్ బొమ్మా, మరో పాలరాతి విగ్రహం, చూపించి "ఎంత బావున్నాయో !" అని మెచ్చుకుంటోంది. తను అంతకుముందు ఎన్నిసార్లు పిప్పరమెంట్ల పాకెట్లూ, బిస్కట్ల పాకెట్లు ఇచ్చాడో ! వాటి ప్రసక్తే మానేసింది. అసలు ఇలా తను కొంత కాలం వూరుకుంటే, రామారావు, ఉత్త పుణ్యానికీ, మంజులతని పెళ్లాడెయ్యొచ్చు. ఇహ లాభంలేదు. అర్జెంటుగా వెళ్లి ఆశీర్వాదం మాష్టార్ని ఈ విష

ఉంటే చెప్పకపోతారా. అని చెప్పుకుంటాడు సుబ్బారావు.

ఆశీర్వాదం మేష్టారు గొప్ప కళా పిపాసి. ఆయన బాగా ప్రయివేటు చెప్తారని, ప్యూకులు ఫైనలు ఫేలయిన కుర్రాళ్లందరి తలిదండ్రులూ తమ పిల్లల్ని ఆయన దగ్గరకే పంపిస్తారు చదువు కోవడానికి. ఆయన చెప్పడం మొదలెడ్తే బాగానే చెప్తారు గాని మధ్యలో సినిమాల ప్రసక్తి వచ్చిందంటే మాత్రం, ఒళ్ళు మరిచిపోయి ఆ ధోరణిలో పడిపోతారు. ఆయన పళ్ళగా, సన్నగా ఉంటారు. పలిక్తే యేళ్ళుంటాయి. అక్షరాభ్యాసంతోబాటు సినిమాలు కూడా అభ్యాసం చేసుకున్నట్లు, తన అయిదోఏటి నుంచి వాటి గురించి తెలుసుకోవడం ప్రారంభించారు. కొత్త సినిమా వూళ్లో విడుదలయింది అంటే, మాష్టారు ట్యూషన్ మాట అటుంచి, ఆవాళ కుర్రవాళ్ళందరికీ ఆ సినిమా గురించే పాఠం చెప్తారు. ఆయనకు ఒక సినిమానటి అంటే బ్రహ్మాండమైన అభిమానం. ఆవిడ పాట అద్భుతమనీ, గొంతుక అపూర్వమనీ పొగుడుతారు. "ఆహాహ్ ! ఏం గొంతుకోయ్ ఆవిడిది ! నభూతో నభవిష్యతి !" అనీ, ఇంకా ఆ పారవశ్యంలో "ఇదిగో సుబ్బారావు ! నాకే గనక దేవుడు వరమిస్తే, అవిడింట్లో నౌకరుగా పనిప్పించమని కోరుకుంటాను. తప్పులేదోయ్ ! అలాంటివారింట్లో నౌకరువని చేసినా తప్పులేదు. మనం పెరట్లో మొక్కలకు నీళ్లు పొస్తూంటే, ఆవిడ ఒకసారి అలా—మేడ మీద నుంచుని ఒక పాట పాడిందంటే, ఒళ్ళు పులకరించిపోదూ ! అహహా !" అంటూంటారు తన శిష్య పరమాణువైన సుబ్బారావుతో, మైమరచిపోతూ.

సుబ్బారావు, మేష్టారితో, రామారావు యొక్క కుట్రంతా చెప్పేశాడు. తన మిత్రుడే తనను ఘోరంగా మోసం చెయ్యదల్చుకున్నాడనీ, తానీ మోసం భరించలేననీ చెప్పేశాడు. ఆఖరి మాటగా ఆశీర్వాదం మేష్టారేమైనా సలహాచెప్పి తననీ ఆపదనుంచి గట్టెక్కిస్తే సరేసరి, లేకపోతే తను దేవదాసులా అయిపోతా నన్నాడు. "ప్రేమ కోసమై వలలో పడెనే పాపం పసివాడూ" అని పాడుకుంటూన్న మేష్టారు, సుబ్బారావు మాటలు విని, సీరియస్‌గా మారిపోయారు. "ఏమిటీ, రామారావా ? వాడికి మన తెలుగు సినిమాతార అంటే నచ్చదుకదూ ! వాడి మొహం. వాడేం పెళ్ళాడుతాడు మంజులతని పోదూ" అని మరో పాట పాడుకోబోతూంటే సుబ్బారావు, "అలా అంటే వీల్లేదు. మీరు ఏదో అయిడియా వెయ్యాలి" అని మరీ మరీ ప్రార్థించాడు.

"సరే. అయితే పద. కొత్తగా విడుదలయిన తెలుగుపిక్చ రొకటి చూసొద్దాం.— అయిడియాలు సాధారణంగా సినిమా హాల్లోగాని, నాకు తట్టవు" అన్నారు మేష్టారు. అలాగేనని సుబ్బారావు బయల్దేరాడు, ఆయనతో సహా. పిక్చరు చూస్తున్నంతసేపూ, మేష్టారు అందులో లీనమైపోయారు. కాని, సుబ్బారావు మాత్రం మంజులత తనకు దక్కుతుందో దక్కదో నని భయంతో పిక్చరు సరిగా చూడలేకపోయాడు. ఆట వదిలి బయటకు రాగానే, మేష్టారు "సుబ్బారావు ! మప్పిక ఎంతమాత్రం విచారించకు. నువ్వుమాత్రం పెళ్ళికి సిద్ధంగా ఉండు" అని సుబ్బారావు వీపు మీద గట్టిగా చరిచి, నవ్వుతూ చెప్పారు. దాంతో సుబ్బారావు కెక్కడలేని ధైర్యమూ వచ్చేసింది.

తిరుగుతుంటే, ఆశీర్వాదం మాష్టారి మాటమీద

# ప్రేమ విలువ

ఏంటిమందికో చాలా గురుంది. ఆయన, 'ఈ యేడు ప్యూకులుఫైనలు పేపరులో ఈ ప్రశ్నలు వస్తాయి' అని చెప్పారంటే ఆ ప్రశ్నలు పడి తీరాలిసిందే. అసలు ఆ ప్రశ్నలకోసమే అందరూ ఆయన దగ్గర ప్రయివేటు కొస్తారు. సంవత్సరంలో పది నెలలు సినిమా కబుర్లతో కాలక్షేపం చేసి, తక్కిన రెండు నెలలూ గబగబ పిల్లల చేత, తను అనుకున్న ప్రశ్నలకు జవాబులు బట్టీ పట్టించేసేవారు. పరీక్షలో సరిగ్గా ఆ ప్రశ్నలే వచ్చేవి. పిల్లలు పాసయ్యేవాళ్ళు. అంత తుపాకి దెబ్బలాగ, పరీక్ష ప్రశ్నలు చెప్పగలిగిన మాష్టారు, మంజులత తనదే అని చెప్పినప్పుడు సుబ్బారావు నమ్మడం సహజమే.

ఆ మర్నాటినుండీ సుబ్బారావులో కాస్త దిగులు తగ్గింది. తను వెళ్తే ముభావంగా పలకరించి లోపలికి వెళ్ళిపోతున్న మంజులతని చూసి నిస్పృహ చెందలేదు. రామారావు వస్తే, వికసించిన మొహంతో ఆమె ఆహ్వానించడం చూసి క్రుంగిపోలేదు. నిబ్బరంగా, మంజులత ఏనాటికైనా తనదే నని నమ్మకంతో ఉన్నాడు.

ప్రియుడు : ప్రేయసీ ! నీ కోసం నేను ఎటువంటి త్యాగమన్నా చేస్తాను.

ప్రేయసి : అయితే నువ్వు నన్ను ప్రేమించడం మానెయ్యి. ఈ త్యాగం చాలు

సి. సురేంద్రనాథ్ (మద్రాసు)

రామారావుని ఒకనాడు భావనారాయణగారు కదిపారు.

"మా అమ్మాయికి నీలాంటి వరుణ్ణి చూసి పెళ్లిచెయ్యాలని ఉందోయ్" అన్నారు నవ్వుతూ.

"దానికేముంది. మా నాన్నగారితో మాట్లాడండి. నాకు పిల్ల నచ్చిందని వాళ్ళతో చెబుతాను." అన్నాడు రామారావు, తన ఆనందాన్ని తనలోనే అణుచుకుంటూ. ఈ మాటకోసమే తను ఇన్నాళ్లనుండీ ఎదురుచూస్తాడు. "ఈవాళే మీ నాన్నగారితో మాట్లాడుతాను" అన్నారు భావనారాయణగారు. ఆయన పెళ్లి విషయం ఇలా కదపడానికి కారణం ఒక విధంగా ఆశీర్వాదం మేష్టారే. ఆయనే భావనారాయణగారితో మెల్లిగా రెండు రోజులు ఈమాటా ఆమాటా చెప్తూ, లోకమంతా భావనారాయణగా రమ్మాయి పెళ్లి ఎప్పుడవుతుందా ? అని ఎదురుచూస్తున్నారనీ, తొందరలో ఆమె వివాహం చేయించాలనీ ఆయన బుర్ర కెక్కేటట్లు చెప్పారు. అంతేకాదు, "సినిమాస్టారులాంటి మీ అమ్మాయిని, ఆమె అందం చూసి మోజుపడే కుర్రాణ్ణే పెళ్లి చెయ్యండి గాని, కట్నాలూ, గిట్నాలూ కావాలనేవాడి కివ్వకండి" అని సలహా చెప్పాడు. ఆ సలహా ఆయనకి బాగా నచ్చింది. వెంటనే, తమ యింటిచుట్టూ తిరుగుతున్న రామారావుని అడిగారు. అతను తన తలిదండ్రుల సదగ సూచనం జరిగాక ఆరోజు సాయంకాలమే వారి వద్ద కెళ్ళి భావనారాయణగారు చెప్పుకుంటారు.

ఆరోజు ప్రొద్దుటే ఆశీర్వాదం మేష్టారు రామారావు తండ్రయిన కామయ్యగారిని కలుసుకోవడం జరిగింది. ఆయన ప్లీడరు. వయస్సు ఏభైఏళ్ళుంటాయి. కొద్దిగా బాదస్తపు మనిషిలా గుంటాడు, పిలకా, నుదుట విభూతి పెండి కట్లతో. "ఏమిటి మేష్టారూ విశేషాలు ?" అని ఆయన అడగగానే మేష్టారు చిరునవ్వుతో "ఆ ఏముంటీ, పెళ్లికొడుకుల తండ్రులతో వేరే పనేముంటాయి. మన జగ్గారావుగారి మూడో అమ్మాయికి సంబంధాలు చూస్తుంటే వాళ్ళకి కంటికి నదురుగా మీ అబ్బాయి కన్పించాడు. నాతో మెల్లిగా ఏమాత్రంలో ఉంటాడోయ్ ? ఆయన" అని అడిగారు.

'నేను, 'పదివేలకు తక్కువలో బాధంలేదండి అనేశాను"

"భేష్. మంచిపని చేశారు. జగ్గారావుగారు తల్చుకుంటే పదివేలే లోకి లెక్కా. ఈ సంబంధం కుదిరితే మీ మేలు మర్చిపోం"

"దానికేముంది గావి, జగ్గారావుగారి స్వభావం మీకు తెలుసుగా. ఒకటీ, రెండు వేలు తగ్గివా తగ్గివట్లేనని చూస్తారు. మీరు గావి లొంగితే ." అని మేష్టారు ఆపి, అదోకలా చూశారు. ఆమాట కర్థం గ్రహించి, "అబ్బే ! నే నెందుకు లొంగుతాను. అసలు మావాడి 'రేటు' పదివేలు అని ఏనాడో నేను నిర్ణయించేశాను." అన్నారు కచ్చితంగా. అది విని ఆశీర్వాదం మేష్టారు తృప్తిగా వూపిరి పీల్చారు.

ఆరోజు సాయంకాలం కామయ్యగారితో పెళ్లి విషయాలు మాట్లాడదామని వచ్చారు భావనారాయణగారు. కామయ్యగారు "మావాడికి పదివేలు కట్నం యిస్తామని విన్నాన్నారు. అంతకు పైమాటైతే మాట్లాడండి" అని అనగానే భావనారాయణగారికి తల తిరిగిపోయింది. వెంటనే సెలవు పుచ్చుకుని ఇంటికి వచ్చేశారు. మంజులత ఈమాట వినగానే నిర్ఘాంతపోయింది. కాని ఇది రామారావు అన్నమాట కాదనీ, అతని తండ్రి అన్నమాట అనీ, రామారావు ఆ రాత్రే తండ్రితో దెబ్బలాడి, కట్నం లేని పెళ్లికి తండ్రిని ఒప్పిస్తాడనీ, మర్నాడు పొద్దున్నే తమ యింటికి వచ్చి రామారావు చెప్తాడనీ వూహించుకుంది

కానీ, ఆమె ఎదురు చూసినట్లు ఆ మర్నాడు రామారావు రాలేదు. అసలు రెండు మూడు రోజుల దాకా అతని జాడే లేదు. కారణ మేమంటే, భావనారాయణగారు పెళ్లి మాటలాడడానికి వచ్చిన రోజు రాత్రే కామయ్యగారు కొడుకుతో, జగ్గారావు గారి సంబంధంమాట చెప్పి, తమకు పదివేలు కట్నం రాబోతోంది గనక, దానిని చెడగొట్టుకునే వెర్రి వేషాలేమీ వెయ్యద్దని చెప్పారు. అది విని "పదివేలే !" అని రామారావు ఆరోజు రాత్రంతా, ఆ పదివేలతోనూ తను పై చదువులకు అమెరికా వెళ్తున్నట్టూ, అక్కడ పెద్ద పెద్ద చదువులు చదివినట్లూ కలలు కన్నాడు మర్నాటినుండీ రామారావుయొక్క దృక్పథమే మారిపోయింది. తను జీవితంలో పైకి రావలసినవాడు, ప్రపంచంలో డబ్బుకున్న విలువ మరి దేనికీ లేదు. అందువల్ల మంజులత లాటి అందమైన అమ్మాయిల ప్రసక్తి పెట్టుకోకూడదు వాళ్లను చూస్తున్నకొద్దీ, అందం కోసం ఏ త్యాగమైనా చెయ్యాలనే బుద్ధి వేస్తుంది. అందువల్ల చూడకపోవడమే మంచిది' అనే నిర్ణయానికివచ్చి, అతను మరి భావనారాయణగారి గుమ్మం తొక్కలేదు. మళ్లీ ఆయనతో మాట్లాడలేదు.

# ప్రేమ విలువ

నాలుగైదు రోజులు గడిచేసరికి మంజులతకి రామారావు తత్వం తెలిసిపోయింది. తన తండ్రికి కూడా కన్పించకుండా మొహం చాటేస్తున్నాడని వినగానే, అతనికి తనయందు నిజమైన ప్రేమ లేదని ఆమెకు బోధపడింది. రామారావుకి కూడా కట్నం యందే కాంక్ష అనీ, తనయందు చూపించిన శ్రద్ధ కేవలం మోసమనీ గ్రహించింది. అసలు మగాళ్లంతా ఇంతే ననుకుంది.

మరో రెండ్రోజులు పోయాక, సుబ్బారావు మంజులత కోసం ఒక చక్కని బహుమానం తీసుకుని వెళ్లాడు. ఆమె మామూలుగానే ఆహ్వానించింది. "మీ నాన్నగారేరీ ?" అనడిగాడు.

"బజారెళ్లారు" అంది.

"అయితే నే చెప్పదల్చుకున్న ముక్కలు నీకే చెప్పేస్తాను."

"ఏమిటవి ?" అని తన సోగ కన్నుల్ని అమాయకంగా పెద్దవిచేసి అడిగింది. సుబ్బారావు ఒక నిముషం ఆమెవైపు చూశాడు. సన్నని నడుమూ విరని ఛాయా కల ఆమె విగ్రహంలో, అన్నిటి కన్నా సుబ్బారావుకు నచ్చింది, గులాబీ రేకుల్లాంటి ఆమె బుగ్గలు. అవి తను దూరంనుంచి చూస్తున్నా ఘుమ ఘుమ వాసనలు వెదజల్లుతూ, మెరుస్తుంటాయి. వాటి సోయగం చూస్తూ మైమరిచినా, వెంటనే తను వచ్చిపని జ్ఞాపకం వచ్చి, దిగులుగా "ఏం లాభం ! భగవంతుడు నాకు అంద మివ్వలేదు రామారావులా పైకి అందంగా కన్పించలేను. కాని, నాకు హృదయముంది అది నీ పాదాల దగ్గర ఏనాడో పెట్టేశాను. అయినా నీకు నామీద అభిమానం కలుగలేదు. దానికి కారణం నా నల్లని రూపం. నాకు కట్నం అక్కరలేదు., నాకేమీ అక్కర్లేదు నీ కడగంటి చూపులు చాలు. నిన్ను దేవతలా ఆరాధిస్తున్నాను. కానీ నీ అనుగ్రహం లేందే ఇక్కడ ఉండలేను దూరంగా జనసముద్రంలో కలిసిపోతాను. కలకత్తా కాళీని స్మరిస్తూ జీవితాన్ని ముగిస్తాను" అన్నాడు. మంజులత తల వంచుకుని చిరునవ్వు నవ్వుకుంది సుబ్బారావు నల్లగా ఉన్నా అతని హృదయం మంచిది. కట్నం కోసం, తనను వదులుకున్న రామారావు కన్నా ఇతనే వెయ్యిరెట్లు నయం.

"ఏం ? కలకత్తాలో ఉద్యోగమొచ్చిందా ?"

"ఆ. మొదట వెళ్లవద్దనుకున్నాను. కానీ, తరువాత ఇక్కడ మరి ఉండలేననిపిస్తోంది అందుకని వెళ్లిపోవా లనుకుంటున్నాను."

"నన్ను కూడా తీసికెళ్తారా ?" అంది చిలిపిగా మంజులత.

"ఆ !" అని ఆమెవేపు చూసి, ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయి "నువ్వు వస్తానంటే - నాకింక కావలసిం దేముంది !" అన్నాడు. అప్పుడే ఇంట్లోకి వస్తున్న భావనారాయణగారు, ప్రక్కనే ఉన్న మేష్టరుతో "మీరు చెప్పినట్లు, కట్నం ప్రసక్తే లేకుండా, మా అమ్మాయిని సుబ్బారావు కిచ్చి వెంటనే పెళ్లి చేసేస్తే, నలుగురూ నా సత్తా గ్రహిస్తారు. అసలు నా గురించి మీ ఉద్దేశం ఏమిటో చెప్పండి" అన్నారు.

మేష్టరు నవ్వుతూ "అబ్బో ! మీరు అన్నంత పనీ చేసితీరుతారని నాకు గట్టి నమ్మకం ఉందండీ" అన్నారు.

సుబ్బారావు మంజులత వైపు చూశాడు. ఆమె ఇంట్లోకి పారిపోయింది. "అయితే ముహూర్తం పెట్టించండి మామగారూ" అన్నాడు భావనారాయణగారితో. ★

# నూ చిన అస్సాం

మంగిపూడి అన్నపూర్ణాదేవి

ప్రేమ వారుగా నెలరపాటు గవర్నమెంటువారి ధర్మమా అని అస్సాం రాష్ట్రం వచ్చాము 4—1—65 తేదిన సాయంత్రము 5గంటలకు ...దరాబాదు నుండి కలకత్తాకు బయలు దేరేము 6వ తేది మధ్యాహ్నము ఒంటిగంటకు హౌరా ...ంది ఆరోజు సాయంత్రం బీహార్ ఎక్స్‌ప్రెస్‌లో యలుదేరి మరునాటి తెల్లవారుఝాముస ... గంటలకు బరౌని చేరాము మేము బరంపురంలో ...ప్ప భోజనము, మాతో కూడ తెచ్చుకున్న పులి ...ర, పూరీలతో గడచింది బరౌని నుండి ఉద ...యం 8 గంటలకు అస్సాం మెయిలులో బయలు ...3 18 వ తేదీ ఉదయం 9 గంటలకు రంగియా ...చ్చాము మరల ఒంటిగంట వరకు బండి లేనం దున సెకండ్‌క్లాసు వెయిటింగురూమ్‌లో గడిపి నాము అదే రోజు రాత్రి 9 గంటలకు తేజపూర్ చేరాము

రైలు ప్రయాణము వరుసగా 5 రోజులు చేయడం మొదటిసారి సుమారు మూడువేల కిలోమీటర్ల దారిలోను, రకరకాల భాషలు, పలువిధముల రైల్వేలు, కొన్నిరాష్ట్రములు వస్తాయి ఆరిఒరియా, హిందీ, బెంగాలీ మరియు అస్సామీల భాషలు సదరన్ రైల్వే, సదరన్ యీస్ట రన్ రైల్వే, నార్త్ ఈస్టరన్‌రైల్వే, నార్త్‌ఫ్రంటీర్ రైల్వే మండలాలు వరుసగా వస్తాయి ఆంధ్ర ప్రదేశ్ తరువాత ఒరిస్సా, బెంగాల్, కొంతభాగము బీహార్, పశ్చిమ బెంగాల్, మరియు అస్సాంరాష్ట్ర ముల గుండా రైలు పోతుంది



మణిపూర్ నృత్యాలు అస్సాంలో బాగా ప్రసిద్ధికెక్కాయి.

ఆరాత్రి తేజ్‌పూర్ రెస్టారెంటులో బసచేసాము. అన్ని వసుపాయములు బాగానే ఉన్నాయి కాని మన భోజనములాగ ఉండదు రెండు రోజులు గడి చిన తరువాత మార్వాడీ ధర్మశాలలో బసచేసి స్వయంగా తెచ్చుకున్న వంటసామగ్రితో వంట ప్రారంభించాము

3రోజుల తరువాత యిల్లు దొరికినది అది బెంగాలీల ఇల్లు ఇక్కడ ఇళ్లు మనవేవు లాగ ఉండవు వారికి అవసరము ఉన్నంత మేరకే యిల్లు కట్టారు అనగా ఒక బెడ్‌రూము, ఒక ఆఫీసురూము, ఒక స్టోరురూము, ఒక వంటగది విడిగా కట్టారు ఎంత గొప్పవారైన సరే ఇంటి కప్పు రేకులతోనే కట్టారు ఒక వరుస యిటిక గాని, కలపతో చేసిన ఫ్రేముతోగాని, వెదురు తడిక లతోగాని గోడలు నిర్మిస్తారు వీటైనన్ని ఎక్కువగా కిటికీలు మాత్రం ఉంటాయి ద్వారబంధములు ఒకటి— తప్పితే రెండు మాత్రమే ఉంటాయి కిటికీలకు ద్వారములకు వారి వారికి నచ్చిన రంగు లలో తెరలు ఉంటాయి కిటికీ తలుపులు పూర్తిగా తెరవనవసరము లేదు అద్దాలు అమర్చబడి ఉంటాయి వెలుతురు కావాలంటే తెరకొంచం తొలగిస్తారు

ఇక్కడ తరచుగా భూకంపములు వస్తాయి. శీతాకాలము విపరీతమైన చలి ఎండాకాలము, వానాకాలము మిళితమై ఉంటాయి ఎండాకాలము ఎండలు విపరీతము వానాకాలము విడవకుండా కుంభవర్షము

తేజ్‌పూర్ అస్సాం రాష్ట్రంలో పరిశుభ్రంగా ఉన్న పట్టణము బ్రహ్మపుత్రానది ఊరుచుట్టూ ఉంటుంది నదికి వడ్డున వద్మాపార్కు చాలా ఎత్తుగా ఉండడంవల్ల, కొంతభాగము బ్రహ్మ పుత్రనది, ఊరు చూచుటకు చాలా అందముగా ఉంటుంది రోడ్లు అన్నీ తారురోడ్లు, మధ్య మధ్య చిన్నచిన్న లోయలు, అక్కడక్కడ చిట్టి డవులు కానవస్తాయి దూరాన్న కనబడుతున్న హిమాలయా పర్వత పంక్తుల ప్రకృతి దృశ్యాలు ఆహ్లాదకరంగా ఉంటాయి

ఇక్కడ వాడుకభాష అస్సామీ, అయినా సగ పాలు బెంగాలీలు, బీహారీలు స్థిరనివాసము ఏర్ప రుచు కొన్నారు తెలుగువాళ్ళు చాల తక్కువ ఇక్కడ మిలిటరీ ప్రాధాన్యత ఉండడము ఒక విశేషము ధరలన్నీ ఆకాశాన్నంటుతాయి కూర గాయలలో ఎక్కువభాగము కేబేజీ, కాలీఫ్లవరు, బంగాళాదుంపలు చింతపండు వాడుక చాలా తక్కువ కరివేపాకు అడివిలా ఉన్నా దాని జోలికి ఎవరూ పోరు కరివేపాకు వాడుక వారికి పూర్తిగా తెలియదన్నమాట ఒకసారి మాయింట్లోనే ఉన్న చిన్నదవితో కరివేపాకు కోస్తూ ఉంటే ఇంటివాళ్ళు

చివరికి జ్వరం అని అడిగేరు? అంటే కరివేపాకు రసం తీసి జ్వరం వచ్చిన వాళ్ళకు యిస్తారుట.

అందరి యింటిముందు భాగములో రకరకాల పూలమొక్కలు ఉంటాయి. కాని వాటిని తలలో పెట్టుకోరు. ఒకవేళ తలలో పెట్టుకొంటే భోగంవాళ్ళని తప్పుగా భావిస్తారు. ఇక్కడ బజారులో గూడ పూల దుకాణములు లేవు. మనం పువ్వులంటే పడిచస్తాము.

ఇక్కడ ఉదయం సాయంత్రం దేవుని ప్రార్థిస్తారు. అప్పుడు ఒకవిధంగా అరుస్తారు. చాల వింతగాను, రాత్రిపూట కొంచం భయంగాను ఉంటుంది. (నక్కలు అరచినట్లుగా ఉంటుంది ఆ అరుపు).

ఇక్కడ స్త్రీలు చాలాభాగము చదువుకుంటారు. వారికి కావలసినన్ని స్కూళ్ళు ఉన్నాయి. వారి వస్త్రధారణ వయసు వచ్చినపిల్లల నుండి ముసలి వాళ్ల వరకు ఒకటిగానే ఉంటుంది. ఒక ఖరీదైన పరికిణి, (బంగారు రంగులో) తెల్లటివోణి, జంపరు జాకెట్లు, బ్రాసరీస్ ఉపయోగిస్తారు. చెవులకు రింగులు తప్ప ఆభరణాలు ఎక్కువగా కనబడవు. రెండు జడలుగాని, ఆంగ్లో ఇండియన్సులాగా 'బాబ్' గాని, ఉంచుతారు. రకరకాలుగా కూడా అలంకరించుకొంటారు. చాలాభాగము ఎర్రగా దబ్బపండులాగ ఉంటారు. చాలా చురుకుగా నడుస్తారు. బజారులో గూడ విచ్చలవిడిగా మగవాళ్లను సయితము లక్ష్యపెట్టనట్లు నడుస్తారు. వీరికి మన ప్రక్కలాగ ఒదిగి ఒదిగి నడవడం రాదు. వీరు స్నానం చేయడం తమాషాగా ఉంటుంది. తల పూర్తిగా అన్ని కాలాలలోను తడుపుకొని, కాళ్ళు, చేతులు మొఖము కడుక్కుంటారు. మగవాళ్లయితే కొంప మునిగిపోతున్నట్లు రెండో మూడో చెంబులు గబగబ పోసుకొని తుడిచేసుకుంటారు

ఆహార పద్ధతులు గూడ చాలా సులభము. ఉదయం టిఫిన్, గోధుమరొట్టె, బిస్కట్లు, పావ్‌రొట్టె, తిని టీ త్రాగుతారు. భోజన పదార్థాలు గూడ మన లాగ ఆదరవులు ఎక్కువగా ఉండవు. శాకాహారులు అన్నమాట పూర్తిగా మర్చిపోవాలి. ఎక్కువభాగము అన్నము, ఒక చాపల కూర, డాల్ (పప్పు)తో భోజనం పూర్తవుతుంది

పండగలు, పెళ్లిళ్లు అనే ఆర్భాటాలు ఎక్కువగా కనబడవు. పెళ్లిళ్లు చాలా వయసు వచ్చేవరకు మనువు శాసించిన ప్రకారము జరుగుతాయి. ఒక్కరాత్రిలో అన్నీ పూర్తవుతాయి. మనలాగ భాజాభజంత్రాలు, బేండు మేళాలు, ఊరేగింపులు లేవు. ఎక్కువగా ప్రేమ వివాహములు జరుగుతున్నట్లు కనబడినవి. స్త్రీలు చాలా అందంగాను, చలాకీగాను, సంతోషంగా కనబడుతారు.

ఇక్కడ దొంగతనాలు తక్కువ అనే చెప్పాలి. అస్సామీలు చాలా అమాయకులు, నీతివంతులు, మోసము అనే మాటకు అర్థము తెలియదేమో అనిపిస్తుంది. ఇక్కడ రిక్షాలు హైదరాబాదు రిక్షాలవలే కాక చాలా ఎత్తుగా కూర్చునేందుకు వీలుగా ఉంటాయి. ఎంత బరువు సామానులైన రెండు చక్రాల బళ్లలో మనుషులు లాగుతారు ఎడ్లబండ్లు లేవు. కాని బండ్లకు ఒకటిగాని, రెండుగాని గుర్రాలను కడ్తారు.

అస్సాం రాష్ట్రంలో చూడదగ్గ పట్టణాలు, గౌహతి, షిల్లాంగు, డిబ్రూఘర్, జోరహాట్, డిగ్‌బోయ్ మొదలైనవి.

గౌహతిలో మన ప్రభుత్వముచే చాలా ధనము వెచ్చించి నిర్మించిన రోడ్—కం—రైలు బ్రిడ్జి చాలా అందంగా ఉంటుంది. మొదటి అంతస్తులో రైళ్ళు, పై అంతస్తులో రోడ్డు. కామఖ్య గుడి చాలా భయంకరముగాను, చూడదగినది. గౌహతి కామరూప డిస్ట్రిక్టు. ప్రాగ్ జ్యోతిష పురము శిశుపాలుని రాజధాని ఇదియే అయి ఉంటుందని అనుకుంటాను.

షిల్లాంగు అస్సాం రాజధాని. ఇది గౌహతి నుండి సుమారు 64 మైళ్ళు. కొండలపై నిర్మింపబడిన అందమైన నగరము. ఇది తిరుపతి కొండవలె మెలికలు తిరుగుతూ చాలా ఎత్తుగా పోతుంది. ఎత్తు వెళ్లిన కొలది వాతావరణములో మార్పు కనిపిస్తుంది. సుమారు ఆరువేల అడుగుల ఎత్తు. ఇక్కడ చూడవలసిన బిషప్ ఫాల్సు, ఎలిఫెంట్ ఫాల్స్, హ పీ వే లీ, అప్పర్ షిల్లాంగు, షిల్లాంగుపేక్, రేస్‌గ్రవుండ్సు, గోల్ఫ్‌గ్రవుండ్సు, స్విమ్మింగ్ పూల్, లేక్ షిల్లాంగు రెస్టారెంటు బరా బజారు; సెక్రటరియేట్, డిస్ట్రిక్ట్ లైబ్రరీ మొ॥. ఇక్కడ సుమారు 30 మైళ్ల దూరములో చిరపుంజి అనే స్థలములో ఒక జలపాతము చూడవలసినది ఉందిట. ఇక్కడ ఎక్కువ వర్షపాతము (ప్రపంచములోని కెల్ల ఎక్కువ) షిల్లాంగులో ఎక్కువ భాగము కస్యాలు, భుటియాలు. నేపాలీలు ఉన్నారు.

ఇక్కడ ప్రకృతి దృశ్యములు చూడవలసినవే కాని, వ్రాయడానికి చాలదు ★

# వనితా వాణి

## స్త్రీ

9—4—65 వ తేది ఆంధ్ర సచిత్ర వార పత్రికలో విశాఖగారు "వేషధారణనుబట్టి శీలాన్ని అంచనా వేయడం తగదు" ఈనాడు స్లీవ్‌లెస్ ఫేషను గనుక అది వేసుకున్నవారే రేపు పమిట పూర్తిగా కప్పుకోవడం ఫేషనయితే అది చేస్తారు" అని వ్రాశారు. అలాగే రేపు పమిట లేకుండా తిరగడం ఫేషనయితే అదీ చేస్తారు మరి. ఫేషను ఏదైనా అది మన సాంప్రదాయము, సంప్రదాయానికి విరుద్ధంగా ఉండరాదు. అలా కానప్పుడు ఆ స్త్రీ వెలితి చూపబడుతుందనడంలో అతిశయోక్తి లేదంటాను. హిందూ స్త్రీ విలాస వస్తువు కాదు. ఆమె పూజింపదగినది లక్ష్మీ సమానురాలు. ఆమెకు సంఘంలో ఒక ప్రత్యేక స్థాన మున్నది. వేషధారణ విషయంలో ఈ విషయం గుర్తుంచుకొని మరీ ఓవర్‌గా పోకూడదంటాను.

జి. లక్ష్మమ్మ (గిరింపేట)

*　*　*

ఈకాలంలో మన ప్రజలలో ఉండే అనుమానాలన్నిటికి దగ్గట్టుక విశాఖగారు వ్రాసేరు. ఆమె వ్రాసిన వాటిలో ఏమాత్రము అబద్ధములేదు. ఆమె వ్రాసిన ఈ వ్యాసము ఈ జన్మలో మరువలేను ఆమెకు నా అభివందనములు.

పుట్టా నీలవేణి (శ్రీకాకుళం)

*　*　*

శ్రీమతి విశాఖగారి 'స్త్రీ' వ్యాసం మాకు చాల నచ్చింది వారు వ్రాసిన మూడు అంశాలను బాగా విశదీకరించారు. సంఘంలో స్త్రీపడే సాధకబాధలను వివరించి వ్రాశారు. సహజంగా స్త్రీ నలుగురిలో చనువుగా ఉంటే అది చూసి సహించలేనివారు చాలమంది ఉన్నారు. విశాఖగారికి మా హృదయపూర్వక అభివందనలు.

కృష్ణవేణి, కనకదుర్గ (నందిగామ)

*　*　*

విశాఖగారి స్త్రీ వ్యాసం చాలా బాగున్నది. ప్రతి చిన్న విషయమునకు విమర్శించి పేర్లు పెట్టేవారికి చక్కటి గుణపాఠంలాంటిది

ఎ. టి. రత్నం (చక్కపల్లి)

ప్రపంచము అనేక రీతులలో మారుతున్నా, వేష భాషలు మారుతున్నా, విద్యాభ్యాసం అతి ఉన్నత స్థానాన్ని అలంకరించినా మానవుల మనస్సులో సంకుచితాభిప్రాయాలు మాత్రం ఇంకా విజృంభిస్తూనే ఉన్నాయి. చదువుకునే వారు కూడ సంస్కార విహీనులుగా ప్రవర్తిస్తున్నారు. తాము చేసిన పనినే మరొకరు చేయగానే విమర్శలు ప్రారంభిస్తారు. చదువుతోపాటుగా సంస్కారము కూడ ఎప్పుడు వృద్ధి అవుతుందో ఆనాడే దేశ సౌభాగ్యం కూడ వెలుగొందుతుంది సోషల్‌గా ఉన్నంత మాత్రాన అవకాశాలని సద్వినియోగం చేసుకుని వేష భాషలని వృద్ధి చేసుకున్నమాత్రంచేత పలువురు పలువిధాలుగా విమర్శలు చేయుడము పరిపాటై పోయింది అది ఏనాటికైనా పోయే అవకాశమున్నదో లేదో!

కుమారి (బరంపురం)

## మధ్యతరగతి జీవనపరిధి

'మధ్యతరగతి జీవన పరిధి' మహిళాలోకం వ్యాసం ఎంతగానో ఆలోచన కల్పించింది. మధ్యతరగతి జీవనపరిధి మీద రచయిత్రి యొక్క అభిప్రాయాలలో ఉన్న సారాంశాన్ని నేను అభినందించగలను. కాని, రచయిత్రితో ఒక్కచోట విభేదిస్తున్నాను. సమస్యలను చిత్రీకరించటం వరకే చేసి, వాటికి పరిష్కారమార్గము చూపటంలో స్పష్టత కనబడలేదు. బహుశా మొదటి రచన అయిఉండవచ్చును ఈ వ్యాసము. ఈనాటి కథారచయిత్రులలో ఒకరైన జయలక్ష్మిగారు చెప్పిన మొదటి వాక్యాలు మరువరానంతగా బాగున్నాయి. నిజంగా ఈనాటి రచనలలో మధ్యతరగతి ప్రతిబింబం కనబడకపోవటానికి గల కారణాలకు ఎవరు సిగ్గుపడాలి ? అదే తెలియటంలేదు. ఇంత చక్కగా, ముఖ్యముగా వ్యావహారిక భాషలో వ్రాసిన రచయిత్రియొక్క నేర్పుకు అభినందనలు. వివిధ సమస్యలమీద ఇంకా మంచి రచనలు అందించ గలరని ఆశిస్తున్నాను.

ఎస్. పాపారావు (కాకినాడ) ★



PULL
HIGH COURT
FINEST SELECTED TOBACCO
MADE IN INDIA




## 4-6-1965 శుక్రవారం మొదలు 10-6-1965 గురువారం వరకు.

**మేషం :** గతవారంకంటే యీవారం అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు యిదివరకు ప్రారంభించిన వ్యవహారాలను యిప్పుడు పూర్తి చేయడంవలన ఆదాయం బాగా ఉంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించగల సూచనలు ఉన్నాయి. వృత్తి ఉద్యోగాల్లో మీపరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రస్తుతం బాగానే ఉన్నా, మొగమాటాలకు లొంగిపోయి భవిష్యత్తుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం మంచిది కాదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృషభం :** ఇతరుల దృష్టిలో యీవారం మీకు యోగవంతమైనదే కాని మీకు మాత్రం అంత సంతృప్తికరంగా ఉండదు. ఎప్పుడు పదిమంది మీతో తిరగడం అందరూ మీమాటకు ఓహో అనడం జరుగుతుంది కాని అందువల్ల మీకు వొరిగేది యేమీ ఉండదు. ఆదాయం మామూలుగా గానే ఉన్నా, రావలసిన డబ్బు సమయానికి అందడం వలన వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన వాగ్దానాలను పూర్తి చేయగలరు. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి స్వల్పాటంకాలు రావచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం ప్రస్తుతం బాగాఉన్నా, నిర్లక్ష్యం చేయ తగదు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం :** వృత్తివ్యాపారాల్లోమీరుస్వల్పాభివద్ధిని సాధించినా, దాని నిమిత్తం మీరు పొందిన వ్యయప్రయాసలతో పోల్చినప్పుడు యీవారం సంతృప్తికరంగా కన్పించదు. వ్యాపారంలో మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో మిత్రుల సహకారంతో అనుకూలతను సాధించగలరు. వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఉద్యోగంలో విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో లాభించగల సూచనలు ఉన్నాయి ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు — కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం :** ఏ వ్యవహారం యెలాగఉన్నా వృత్తి వ్యాపారాల్లో ఆదాయం బాగా ఉంటుంది. భారీయెత్తున చేసే వ్యాపారాల్లో మీకార్యక్రమాలకు యిదివరకు యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలు జరిపి, అధికారుల ఆదరాభిమానాలు పొందగలరు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | | ర బు గు రా | శు |
| శ | వారఫలం మహేష్ | | చం |
| | | | కు |
| | కే | | |

సంఘటనలు జరుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— వారాంతంలో ఆరోగ్యం బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో ప్రముఖపాత్రను నిర్వహించగలరు.

**సింహం :** గ్రహబలం అనుకూలంగా ఉంది. ఇదివరకు మీరు ప్రయత్నం చేసినా, నెరవేరని వ్యవహారాలు యిప్పుడు సానుకూల పడతాయి. మీకు అంతగా సంబంధంలేని వ్యవహారాల్లో చిక్కుకొనడంవల్ల వ్యాపారంలో మీరు పొందవలసినంత ప్రయోజనాన్ని పొందలేని పరిస్థితి యేర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో లాభిస్తాయి. వృత్తిలో మీపరిస్థితి బాగానే ఉంటుంది. ఉద్యోగంలో కొంచెం శ్రమ కలిగినా, గౌరవం బాగా ఉంటుంది. వ్యాపారం భారీయెత్తున చేయడంవల్ల ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో యిదివరకు యేర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. విలాస వస్తువులు కొంటారు.

**కన్య :** వారం ప్రారంభంలో అంతబాగా ఉండదు కాని రానురాను అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడంవలన ఆదాయంతో పాటు పోటీవారితో గౌరవం కూడా లభిస్తుంది. వృత్తిలో మీ శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. ఆదాయం బాగానే ఉన్నా, సమయానికి డబ్బు అందక పోవడం వలన కొన్ని కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణిస్తుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

స్త్రీలకు —ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**తుల :** ఈవారం కూడా యే వ్యవహారంలోనూ విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. వ్యాపారంలో మీరు యిదివరకు జరిపిన వ్యవహారాలవల్ల వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. భారీయెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. ఉద్యోగంలో మీరు యితరులకు ఉపకారం చేయడానికి ప్రయత్నించడంవలన అనవసరమైన శ్రమకు గురికాగల సూచనలు ఉన్నాయి. సాంఘిక కార్యక్రమాలకు అనుకోని మార్పులు వస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

### ఈ వారం ధరలు

అపరాల ధరలు వారం ప్రారంభంలో కొంచెం పెరిగి వారాంతానికి తగ్గుతాయి. బెల్లంధర క్రమంగా పెరుగుతుంది. చింతపండు ధర నిలకడగా ఉంటుంది. మిర్చి ధర కొంచెం పెరుగుతుంది. నూనె, నువ్వుల ధరలు వారాంతంలో పెరుగుతాయి.

**వృశ్చికం :** మీ స్వంతపనులమాట యెలాగ ఉన్నా, యితరుల నిమిత్తం మీరు చేసే ప్రయత్నాలు నిరాటంకంగా నెరవేరుతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మీరు యిప్పుడు చేసే ప్రయత్నాల వలన వెంటనే యేమీ ప్రయోజనం లేకపోయినా, ముమ్ముందు తగిన ప్రతిఫలాన్ని పొందగలరు. ఉద్యోగంలో అనుకూల వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రయోజనంలేని వ్యయప్రయాసలకు గురికాగలరు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో ఆదాయం బాగానే ఉంటుంది కాని పోటీవారితో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో యితరుల జోక్యం వల్ల ఆలస్యం కావచ్చును. వృత్తిలో యెవరితోను వాద ప్రతివాదాలకు దిగడం మంచిది కాదు. వారాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో మీరు జోక్యం చేసికొని అనుకూలతను సాధించగలరు. ఆరోగ్యం బాగానే ఉంటుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అనుకోని వ్యయం జరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

**మకరం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగే పరిస్థితులు యేర్పడతాయి. గాని వారాంతానికి అన్ని వ్యవహారాల్లోను క్రమాభివృద్ధిని సాధించగలరు మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసి

...వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సామాన్యంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు ఇదివరకటి కంటే బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ

# వారఫలం

పక్షంతో యిదివరకు యేర్పడిన భేదాభిప్రాయాలు చాలవరకు తొలగిపోతాయి.













స్త్రీలకు — ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కుంభం :** ఈవారం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును కాని మీకు వ్యతిరేకంగా యేమీ జరుగదు. వ్యాపారంలో మీకు ముమ్ముందు లాభించగల ఒప్పందాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీ మంచితనాన్ని తమ స్వార్థానికి వినియోగించుకోవడానికి ప్రయత్నిస్తారు ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు అనో కొన్నట్లుగా నెరవేరుతాయి సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మీనం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగడంవలన ఆదాయం బాగా ఉంటుంది. మిత్రుల తాలూకు వ్యవహారాలు కూడా చూడవలసిన అవసరం యేర్పడడం వలన కార్యభారం పెరిగినా ఉదకు అన్ని వ్యవహారాల్లోను విజయాన్ని సాధించగలరు భారీయెత్తున చేసే వ్యాపారాల్లో అనుకూల వార్తలను వింటారు. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. ఉద్యోగంలో పైవారితో స్వల్పభేదాభిప్రాయాలు రావచ్చును సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది

స్త్రీలకు— వారాంతంలో స్వల్ప అనారోగ్యం చేయవచ్చును అలంకార వస్తువులు కొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

## జన్మదినఫలం

### జూన్-4

ఈ సంవత్సరం మొదటిభాగం సామాన్యంగానే ఉంటుంది కాని రెండవభాగం చాలా అనుకూలంగా ఉంటుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించడం వలన ఆదాయంతోపాటు పైవారితో గౌరవాన్ని కూడా పొందగలరు. అధికారుల వలన జరుగవలసిన పనులకు మాత్రం ఆటంకాలు వస్తుంటాయి. వృత్తిలో దూర ప్రయాణాలు చేసి కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు అందుతుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువులతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. అలంకార వస్తువులు కొంటారు. విద్యార్థులకు మార్చి పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

## జూన్-5

ఆదాయం సామాన్యంగా ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను హడావుడి మాత్రం అధికంగా ఉంటుంది. మీరు మొగమాటాలకు లొంగిపోవడం వల్ల, మీకు అంతగా ప్రయోజనం లేని వ్యవహారాల బాధ్యతను వహించవలసి వస్తుంది. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో యిదివరకు యేర్పడిన అనిశ్చిత పరిస్థితి చాలవరకు తొలగిపోతుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు మాత్రం అంతబాగా ఉండవు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో కొంచెం శ్రమమీద అనుకూలత లభిస్తుంది. వినోద యాత్రలు చేస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## జూన్-6

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో తగినంత అభివృద్ధిని సాధించగలరు కాని పోటీవారితో మాట పట్టింపులు రాగల సూచనలు ఉన్నాయి. నూతన వ్యాపారాలు అనుకొన్నంత ప్రోత్సాహకరంగా ఉండకపోవచ్చును. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. ఉద్యోగంలో కొంచెం కార్యభారం పెరిగినా మీ కృషి అధికారులు గుర్తించగలరు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా అధిక వ్యయం జరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

## జూన్-7

వృత్తి వ్యాపారాల్లో మీరు చేసే ప్రయత్నాలకు ప్రారంభంలో స్వల్ప ఆటంకాలు వచ్చినా, సమయానికి మీకు కొంతమంది వ్యక్తుల సహకారం లభించడం వలన వాటిని అధిగమించి తగిన ప్రయోజనాన్ని పొందగలరు. సంవత్సరం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో క్రొత్త వారితో పోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఉద్యోగంలో అధికారులు మీపట్ల అనుకూలంగానే ఉంటారు. కాని పోటీవారితో భేదాభిప్రాయాలు రావచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యాల విషయంలో కొంచెం అభివృద్ధి ఉంటుంది. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## జూన్-8

వృత్తి వ్యాపారాల్లో ఆదాయం బాగానే ఉన్నా, యే క్షణంలో యేమి జరుగుతుందో అనే ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడటం వలన యీ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండదు. దీర్ఘకాలానికి ఫలితాన్ని యిచ్చే భారీ వ్యవహారాల్లో ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సమయానికి డబ్బు అందక లాభం వచ్చే వ్యవహారాలను కూడా సంవత్సరం మధ్యలో వదులుకోవలసి వస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సంవత్సరాంతంలో ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఉద్యోగంలో స్థానచలనమునకు అవకాశం ఉంది. సాంఘిక వ్యవహారాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు. కుటుంబ సభ్యులకు అనారోగ్యం చేస్తుంది. విద్యార్థులు మొదటి నుంచి శ్రద్ధగా చదవటం మంచిది.

## జూన్-9

వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేవో ఆటంకాలు రావడం వలన నిలిచిపోయిన వ్యవహారాలను యిప్పుడు పూర్తి చేయగలరు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వాని ఫలితం మాత్రం అంత సంతృప్తికరంగా ఉండదు. మీకు అంతగా యిష్టంలేకపోయినా, కొన్ని వ్యవహారాల్లో మధ్యవర్తిత్వం వంటి పాత్రను నిర్వహించవలసి వస్తుంది. వృత్తిరీత్యా దూర ప్రయాణాలు చేస్తారు. ఉద్యోగంలో ఉన్నత స్థానం కోసం చేసే ప్రయత్నాల్లో మీకు అధికారుల తోడ్పాటు లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో బాధ్యతతో కూడిన పదవిని నిర్వహించగలరు. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

## జూన్-10

అప్పుడప్పుడు కొద్ది చికాకులు కలిగినా మొత్తం మీద యీ సంవత్సరం అనుకూలంగానే ఉంటుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోవడం వలన అభివృద్ధిని సాధించగలరు. కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు యిప్పుడు చేతికి వస్తుంది. వృత్తిలో పోటీవారితో పోటీని యెదుర్కొని విజయాన్ని సాధించగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో ప్రతికక్షులు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. 



"ఆ అమ్మాయి కళ్ళకి గంతలు కట్టుకుందెందుకు?"
"అవి గంతలు కావు. కాటుక!!"

## చెమటకాయలనుండి వెంటనే ఉపశమనము పొందుటకు

# జాన్సన్స్•
# ప్రిక్లీ హీట్
# సబ్బు మరియు పౌడరు

**జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సబ్బు:**
రోగ క్రిములను అదుపు. చెమటకాయల వలన కలిగే బాధకు కారణమైన చర్మముమీది సూక్ష్మ రంధ్రముల మూసుకొని పోవుటను అరికట్టును. దీనిని వాడితే మీరు చల్లగా, సౌఖ్యముగా, ఉత్సాహముగా ఉంటారు!

**జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరు:**
సౌమ్యమైనది. నిశ్చయముగా గుణము కలిగిస్తుంది. శీతలమైన సువాసనగలది. చెమటకాయలనుండి వెంటనే ఉపశమనము కలిగిస్తుంది. ఎండలలో మీరు చల్లగా, హాయిగా ఉండేలా చేస్తుంది!

• ట్రేడ్ మార్కు.






జాన్సన్ అండ్ జాన్సన్
ఆఫ్ ఇండియా లిమిటెడ్
30, ఫోర్జెట్ స్ట్రీట్, బొంబాయి-26

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం
## (రెండవ భాగం)

[రెండవ సంపుటం : కాకతీయ యుగం. రచయిత: శ్రీ ఆరుద్ర. పుటలు: 1/16 క్రౌను 270. వెల: రూ 5-0. ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్టణము, సికింద్రాబాదు]

పైరవారి విమర్శలను తెరచిన మనసుతో సరసతతో స్వీకరించి, సత్యప్రవణతతో సాగిపోవడం సహృదయుడయిన రచయిత నైజం. అలాటిది ఈ సమగ్ర ఆంధ్రసాహిత్యం రెండవ సంపుటంలో కనిపిస్తూ ఉండడం హర్షించదగింది.

శ్రీ ఆరుద్ర ఈ సంపుటానికి కాకతీయ యుగం అని పేరుపెట్టడం సముచితంగానే ఉంది. జేతరాజు నన్నయకంటె ముందున్నవాడు గనుక విజయనగరకాలం వరకు కాకతీయయుగంగానే వింగడించారు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘికచరిత్రలో. కాకతీయయుగంలోని సుప్రసిద్ధా ప్రసిద్ధకవులు — మంత్రి భాస్కరుడు, భాస్కరునికేతన, యథావాక్కుల అన్నమయ్య, క్షేమేంద్రుడు, తిక్కన సోమయాజి, ఆంధ్రభోజుడు, అప్పనమంత్రి, శివదేవయ్య, మూలఘటికకేతన, బద్దెన, కమలనాభా మాత్యుడు—అయ్యన, మంచన, పాల్కురికి సోమనాథుడు, మారన, అధ్వర్యాణాచార్యులు—అనే16మందిని, ప్రసక్తాను ప్రసక్తంగా నీతిసారం, ప్రథమ పంచతంత్రి, కామందకం రచయితలను, మరికొందరిని శ్రీ ఆరుద్ర ఈ సంపుటంలో తెలిపారు.

మొదటి సంపుటంలోకన్నా దీనిలో కవి హృదయ సమున్మీలనం — ముఖ్యంగా లక్షణకారులు, సకలనీతి సమ్మతం వంటి వాటిలో సంకలన గ్రంథకారులూ ఉదాహరించిన పద్యాలను బట్టి మరుగు పడిన కవులను ప్రత్యేకశీర్షిక కింద తెలుపడం, వారి పద్యాలను దొరికినంతవరకు ఇచ్చి వివరించడం— ఎక్కువగానే కనిపిస్తుంది. ఈ పద్ధతి ఎంత ఎక్కువయితే, సాహిత్యభిరుచిగలవారికి అంత ప్రయోజనకరం.

భాస్కర రామాయణం కర్తృత్వ విషయంలో శ్రీ అనుముల సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'కుమార రుద్రదేవకవి'అనే గ్రంథం ప్రామాణిక మనుకుంటాను భాస్కరుడు రామాయణం త్వరగా ముగించదలచి తన శిష్యులకు కొంత పంచిపెట్టి, తను కొంత చేసి వుంటాడని, ఇందరు చేసినా — పలువురి ప్రయత్నంతో పూర్తి అయిన వేదభాష్యం విద్యారణ్యుని పేరుతో ప్రసిద్ధి పొందినట్టు—భాస్కరుని పేరుతో వ్యాప్తి చెందిందని శ్రీ శాస్త్రిగారు నిరూపించారు. కనుక కుమారరుద్రదేవునికిగాని, ఇతరులకుగాని సాహిత్య చుట్టరికం పాపం అంటదు. ఆ పుస్తకం ఒకసారు తిలకించాలని శ్రీ ఆరుద్రను కోరుతున్నాను.

ఈ సంపుటంలో తిక్కన గురించి వ్రాసిన 88 పుటలలోను శ్రీమతి దేశిరాజు భారతీదేవివంటి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి "ఆంధ్రభారత కవితా విమర్శము"ను మరవడం నాకు మట్టుకు వింతగానే వుంది. అది తిక్కన భారతంపై ఇంతవరకు వచ్చిన సాహిత్య విమర్శలకు తలమానికం. శ్రీ రామకృష్ణయ్యగారు దానినొక కావ్యంగా, కథగా, నవలగా వ్రాశారు.

శ్రీ ఆరుద్ర తిక్కన పదప్రయోగచాతురి మొదలయిన వాటిని తగినంతగా వర్ణించారు. తిక్కన తన కాలపు మాండలికాలనే కాక యావదాంధ్ర వ్యవహారాన్ని స్వీకరించాడనే చెప్పాలి.

"కైపు" శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు అన్నట్టు (పుట—102) అన్యదేశ్యం కాదు; శ్రీ ఆరుద్ర అనుమానించనక్కరలేదు కశప్పు, కహి అనేవి తెనుగులోబుట్టువులలో కనిపిస్తున్న సమానార్థక సమానరూపక పదాలు. చేదు, విషం అని వాటి అర్థం. తర్వాత లాక్షణికంగా మత్తు కలిగించేదిఅనే అర్థంఏర్పడింది. కశప్పు—కయప్పు కైపు.

తిక్కన పర్వాంతంలో ఆనందముద్ర వేశారనడం మొదలయిన విషయాలు బాగున్నాయి.

మూలఘటిక కేతన ప్రకరణంలో 'ఆంధ్రభాషా భూషణం' ప్రసక్తిలో శ్రీఆరుద్ర ఒక్కసంగతి మరచారు. మన ప్రాచీన కవులందరూ సంస్కృతమేకాక ఇరుగుపొరుగు కన్నడాది భాషలు వచ్చిన వారే కేతనామాత్యునికి ముందు కన్నడంలో ద్వితీయ నాగవర్మ రచించిన కర్నాటకభాషా భూషణం అనే వ్యాకరణం ఉంది అతడే కావ్యావలోకనం అనే మరొక లక్షణగ్రంథమూ వ్రాశాడు. కర్నాటక భాషా భూషణం సంస్కృత సూత్రాత్మకం పాణిని అష్టాధ్యాయిలాగ. దీనిని కావ్యావలోకనంలో కందాలతో వివరించాడు నాగవర్మ. ఆరెండిటినీ కేతన పూర్తిగా అనుసరించాడు. ఈ రెండిటినీ పరిశీలన జరిపి పదేళ్ళ క్రితమూ, ఇటీవలా నేను విపులంగా వ్రాశాను. (సాహితీ సుగతుని స్వగతం—భారతి.)

పినుంగు (200) పీనుగుకు అతిప్రాచీనమైన రూపం. తమిళంలో పిణం, కన్నడంలో పెణ, హెళ దీని అర్థం మృతుడే తర్వాత లక్షణయా వచ్చినవి శక్తిహీనుడు, అవివేకి అనే అర్థాలు.

మంచన ఏప్రాంతంవాడన్న చర్చలో శ్రీ ఆరుద్ర

'మొగిళులలోని యేకతము
ముచ్చిలి పుచ్చుకొనంగ జాలు ద
స్తగిరికి దామ్రపర్ణికిని
సంగమమైన ఘటింప నేర్తు నిన్
మిగిలినయట్టి బుద్ధిమతి
మేదిని నెందును గాన నేమి క్రొ
త్త గలుగ జూచి పెండిలి ము
దంబని యాడితి బోటి చెప్పుమా"
(4—180)

అన్న పద్యం ఉదాహరించి "ఈపద్యంలో దస్తగిరికి, తామ్రపర్ణికి సంగమం ఘటించడం అనే మాటలవల్ల ఏమైనా తెలుసుకో వచ్చునేమో! తామ్రపర్ణినది తిరునెల్వేలి జిల్లాలో ఉంది. దస్తగిరి యెక్కడుందో! ఇది సామెత కాబోలు! ఇవి పరిశోధనవల్లగాని ఇది తేలదు." అన్నారు.

[illegible] తెలికో జాలెదవు. అస్తగిరికి తామ్రపర్ణికి సంగమం ఘటింప గలవు. నిన్ను మించిన బుద్ధిమంతురాలు ప్రపంచంలో ఎక్కడా లేదు. అలాటి వివేకవంతురాలివి, ఏమి కొత్తదనం చూచి ఈతన్ని పెండ్లాడావు?" అని ఈ పద్యం తాత్పర్యం.

తామ్రపర్ణి తూర్పు సముద్రంలో పడేది. అస్తగిరి పడమటి దిక్కున ఉండేది. నీవు తూర్పును, పడమరను ఏకం చేయగలిగినదానవు అని అర్థం. పుచ్చుకొనంగ జాలుదువులో వు వర్ణం లోపించి పోగా, జాలుదు+అస్తగిరి = జాలుదస్తగిరి అయింది సంధికార్యంవల్ల. ఇది అస్తగిరే కాని, దస్తగిరి కాదను కుంటాను.

"పాల్కురికి సోమనాథుని గురించి తగినంత వ్రాయలేదనే చెప్పాలి" అని పీఠికలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన దానితో నేనూ ఏకీభవిస్తున్నాను. పండితారాధ్య చరిత్ర సమాప్తిలోని పండితుని పౌరవ సంతతి, విద్యా సంతతి వర్ణనలోని నుడికారాన్ని బట్టి సోమనాథుడు పండితుని తర్వాతి తరంవాడు, నన్నె చోడునికి దగ్గరివాడు, నన్నయ్య, తిక్కనల మధ్య వాడు అయి వుంటాడనే శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వాదమే హేతుసహంగా కనిపిస్తుంది ఇంతవరకు. శ్రీ ఆరుద్ర ఈ విషయం మరొకమారు ఆలోచింప గోరినాను.

అనాడు వీరశైవం మాత్రమే కాదు. భక్తి ప్రపత్తులకు ప్రాధాన్యమిచ్చిన విష్ణు సర్వోత్తమత్వ ప్రతిపాదకమైన మతంకూడ హింసకు పూనుకుందని చరిత్రే చెబుతున్నది. ఇక జైన బౌద్ధాల పతితావస్థకు తార్కాణ లెన్నో ఉన్నాయి. మతంపై అంత నమ్మకం ఉన్నప్పుడు సాహిత్యంలో అది ప్రతిబింబించక పోవడం, ప్రచారం ఉండక పోవడం సాధ్యంకాదు. ఆదికావ్య మనబడే రామాయణంలో అన్నభార్య తల్లి అని ఎందుకు అంతగా అంగలార్చడం? అంతయినా, అన్న మరణం తర్వాత వదినను తమ్ముడు పెళ్లాడే సంప్రదాయం రాముడు జన్మించిన ఆర్యావర్తంలో నేటికీ అడుగంటలేదే! ప్రచారంపాలు ఎక్కువయినా, ప్రమాద మేమీ లేదు. వీరశైవ విప్లవం రాకపోయివుంటే, సమాజంలో ఇతర వర్గాలకు స్వాతంత్ర్య మనేదే ఉండేదికాదు. సారస్వతంలో జాను తెనుగనేదే ఉండేదికాదు. కవితలో దేశి కవిత అనేదే ఉండేదికాదు. సోమనాథుడు అప్పటి వ్యావహారిక భాషోద్యమం; అప్పటి మూగప్రజలకు మైక్. అప్పటి ప్రజాసాహిత్యపు పసిడి పంట.

సోమనాథుని రచనలను మెచ్చుకోడం కావ్య రసానుభవ సంస్కారం తగినంత లేదని ఎవ్వరాక్షేపించినా పరవాలేదు. అవి వీరశైవులకు భారత రామాయణాలలాగా పారాయణ గ్రంథాలు. ఆ విలువ చాలు వాటికి.

శ్రీ ఆరుద్ర చెప్పినంతలో సోమనాథుని గురించి స్పష్టంగానే చెప్పారు. కాని, కవుల వరుసలో మంచన తర్వాత అతనిని చేర్చడం న్యాయంగా లేదు. ఇది అతడు అర్వాచీనుడని చెప్పకనే చెప్పడం కదా! అన్ని వాదాలూ ఇస్తున్నప్పుడు (మెజారిటీ పద్ధతిని అనుసరిస్తున్నప్పుడు) నన్నయ తిక్కనల మధ్యనే చేర్చ వచ్చు గదా!

కాకతీయయుగం వరకే మనకు అన్ని సందేహాలు, మత భేదాలూను. తర్వాతి యుగాలలో వివాదాలు అంతగా ఉండవు గనుక శ్రీ ఆరుద్ర రచన, నిరూపణ ముమ్ముందు ఇంతకన్నారంజకంగాఉండగలవని నమ్ముతున్నాను.

రామచంద్ర ★

[illegible]

# పసిడి మనసులు

హరికిషన్

గంగాధర్

**కొత్త సీరియల్ ప్రారంభం**

జ్యోతి ఆ రోజున కాలేజికి కొంచెం ఆలస్యంగా వెళ్ళింది. కారణం తల్లికి సుస్తీ. తండ్రి డాక్టర్ కనుక మందుకు ఆస్పత్రికి వెళ్ళనక్కర్లేకపోయినా, తల్లి పక్కలోనే కూర్చుని కబుర్లు చెపుతూ కాలేజికి వేళయిందన్న సంగతి మర్చిపోయింది. పదిగంట లయ్యాక "ఇంక భోజనంచేసి కాలేజికి వెళ్ళు తల్లీ, నాకు జ్వరం రేపటితో తగ్గిపోతుందని నాన్నగారు చెప్పారు కదూ" అని తల్లి చెప్పిన మీదట నాలుగు మెతుకులు నంజి కాలేజికి వెళ్ళింది జ్యోతి.

క్లాసు ప్రారంభించి పావుగంట యింది. వరండాలో గుమ్మంముందు నిల్చున్న జ్యోతిని కోపంతో ఒక్క సారి చూసి "కమిన్" అన్నాడు లెక్చరరు. జ్యోతికి అభిమానంతో చచ్చినంత పనయింది. సీటులో కూర్చున్న జ్యోతిని చూసి కొంత మంది ఏమో గొణుక్కున్నారు. సహాధ్యాయినులు చిన్నగా నవ్వి ఊరుకున్నారు. తల కొట్టేసినంత పనయింది జ్యోతికి. కాలేజిలో చేరిన ఈ రెండు సంవత్సరాల్లో జ్యోతి ఎప్పుడూ ఆలస్యంగా వెళ్ళలేదు.

గంట కొట్టారు. ఆ క్లాసయింది. లెక్చరరు వెళుతుండగా "టెలిగ్రాం సార్" అంటూ పోస్టు మేన్ ఎదురొచ్చాడు.

"ఎవరికి వాళా" అన్నాడు లెక్చరర్

# పసిడి మనసులు

పుతా కారణం అంతకు క్రితరరోజునే పెద్దనాన్న గారికి టైఫాయిడ్ అని ఉత్తరం వచ్చింది. ఆయ నకు ప్రమాదించేందేమోనని ఈయన ఖంగారు పడ్డాడు.

"మీక్కాదు సార్ కుమారి జ్యోతికి" అన్నాడు పోస్టుమేన్.

ఆయన గుండె నిబ్బరం చేసుకుని జ్యోతిని చూపిస్తూ "అదుగో ఆ అమ్మాయే" అన్నాడు.

ఈమాట విని జ్యోతి వరండాలోకి వచ్చి సంతకం చేసి టెలిగ్రాం తీసుకుంది. కవరు విప్పుతుంటే చేతులు వణికిపొయ్యి. టెలిగ్రాం చదువుకోగానే అమితానందంతో లెక్చరరు వైపు చూసి "నాకు నవలల పోటీలో మొదటి బహుమానం వచ్చిందండి పదిహేను వందలు" అన్నది

"వెరీగుడ్. మై హార్టీ కంగ్రాట్యులేషన్స్ జ్యోతీ" అని నవ్వుతూ వెళ్లిపోయాడు లెక్చరరు.

సంతోషంతో విప్పారిన ముఖంతో అటూ ఇటూ నవ్వుతూ చూస్తూ, తన సీట్లోకి వస్తూనే, "నాకు మొదటి బహుమతి వచ్చిందే కమలా" అంటూ పక్కనున్నమ్మాయికి టెలిగ్రాం కాయితం ఇచ్చింది. అంతా ఎంతో సంతోషంతో అభినందించారు.

క్లాసులోని మగపిల్లలంతా కూడా అభినం దించారు. జ్యోతి మనస్సులో సంతోష తరంగాలు గలగల లాడుతూ తరలిపోతున్నయ్యి అంతమంది ఒక్కసారి అభినందిస్తుంటే ఉక్కిరిబిక్కిరై పోతున్నది.

"అయితే పార్టీ ఎప్పుడే జ్యోతీ పార్టీ ఇవ్వక పోతే ఆ ప్రకటనానికి మేమంతా సంతకాలు పెట్టి మహజరు పంపిస్తాం" అన్నది వనజ

"ఏమనేం" అన్నది జ్యోతి ఆదుర్దాగా

"ఏమనా, జ్యోతి రాసిన ఈ నవల స్వతంత్ర రచన కాదు. ఎక్కడో కాపీ కొట్టింది కాబట్టి ప్రైజు ఇవ్వటం పొరబాటని' అన్నది కమల

"అమ్మయ్య, అంతేకదా. అయితే సంతకాల సేకరణ ఇవ్వాళనుంచే ప్రారంభించండి" అన్నది జ్యోతి.

ఇంతలోకి సెకండ్ అవర్ లెక్చరర్ క్లాసులోకి వచ్చాడు. వస్తూనే "కంగ్రాట్యులేషన్స్ జ్యోతి" అన్నారు.

అప్పుడే ఈ విషయం కాలేజీ అంతా తెలిసి పోయింది.

మనస్సుకు మించి వేగంగా పోయేది ఏదీ లేదు. జ్యోతి మనస్సులో అమ్మా, నాన్నా మెదిలారు. వాళ్లకూ ఈ శుభవార్త చెప్పాలిగా!

అపూట ఇట్లా అభినందనలతోనే గడిచి పోయింది.

మధ్యాన్నం శలవుపెట్టి ఇంటికి వెళ్లింది జ్యోతి.

రిక్షా దిగి ఇంట్లోకి వస్తూనే తల్లి దగ్గరకు వెళ్లి "అమ్మా, ఫస్టు ప్రైజు" అంటూ టెలి గ్రాము చేతికి యిచ్చింది.

జ్యోతి తల్లిపేరు రత్న. టెలిగ్రాం చదువు తుంటే ఆమె మనస్సు ఆనందంతో మునిగి కళ్లు ఆనందభాష్పాల్ని వర్షించినాయి.

జ్యోతి తల నిమురుతూ "మంచిదే తల్లీ కాని, ఈ ధ్యాసలో పడి జీవితం, కాదు, కాదు, చదువు పాడుచేసుకోకు రచనల్లో ప్రైజులు రావచ్చు నుదుటిరాతల్ని ఎన్నుకుని అందులో బహుమతు లిచ్చేది ఆ పరమాత్ముడు ఒక్కడే. మన నుదుటి వ్రాతల్ని మనం తరచి చూడుకోవటం చాలా మంచిదమ్మా" అన్నది రత్న

నివ్వెరపోయింది జ్యోతి ఇంత సంతోషవార్త విన్నందుకు కలిగిన ఆనందంలో తనూ భాగం పంచుకోక, అమ్మ ఇట్లా మాట్లాడుతుందేమిటా అనుకుంది.

నిర్లిప్తతతో కూతురువైపు చూసింది రత్న అరచేతితో జ్యోతి వీపు నిమురుతూ, "విద్యార్థి జీవితంలో పాఠ్య పుస్తకాలకు మించి ఎక్కువగా పత్రికల్లో కథలు చదివేదాన్ని ఏది ఏమైనా అదో ప్రపంచం. రచనలు చేసేవారి మనస్సు వూహా లోకంలో విహరిస్తూ ఉంటుంది. అనేకమంది జీవితాలను, తాము నిర్మించుకున్న వూహాలోకంలో తిరుగుతూ, తిలకించగలరు. వారి మనస్సులోని ఆలోచనల అంచనాలూ, మేధాశక్తి ఎంతో ఉన్నత మైనవి, ఉత్కృష్టమైనవి. కాని, అదంతా కల్పనా ప్రపంచం. నిత్యజీవితంలో ఏ ఒక్క కల్పిత మైన పాత్రనూ అనుసరించలేదు. అట్లా అనుస రించగలిగితే వాళ్లు ఎంతో అదృష్టవంతులని చెప్పాలి" అన్నది రత్న

జ్యోతికి ఇదేమీ అర్థంకాలేదు రత్న ఏమిటో ఆలోచిస్తున్నది.

"నువ్వనేది నాకు తెలీటంలేదమ్మా" అన్నది జ్యోతి.

తల్లి మనస్సులోని భావాలు జ్యోతికి అర్థం కాలేదు. ప్రస్తుతం ఆమెకు అర్థమైంది తనకు ప్రైజు వచ్చిన నవలలోని పాత్రలూ, తను సృష్టిం చిన సంఘటనలూ మాత్రమే.

అప్పుడే మేడమీది నుంచి వస్తున్న తండ్రిని చూసింది జ్యోతి.

"అరె, నాన్నారు ఇంట్లోనే ఉన్నారే నేను చూడనేలేదు నాన్నారు గుడ్ న్యూస్" అంటూ సంగతి చెప్పింది.

"చాలా మంచిదమ్మా. సంతోషకరమైన సంగతే కాని, ఇప్పట్నుంచే ఆ రచనల ధ్యాసలో పడితే చదువు కుంటుపడుతుంది. జాగ్రత్తగా చదువుకో జ్యోతీ" అన్నారాయన తల్లిదండ్రులిద్దరూ కూడా తన సంతోషంలో ఎక్కువ పాలు పంచు కోకపోయేనరికి జ్యోతికి మనస్సులో కష్టం కలిగింది ఇంక ఆ మాటలు తప్పించటానికి,

"నాన్నారూ, అమ్మకి ఇవ్వాళ నార్మలుకు వచ్చింది కదా, రేపు చారన్నం తినొచ్చునా" అన్నది తండ్రిని చూస్తూ.

ఆయన ఎందుకో కళ్లొత్తుకుని "తప్పకుండా రేపు పథ్యం తినొచ్చునమ్మా. నేను డాక్టరునై ఉండి అమ్మచేత ఆరు లంకణాలు చేయించాను" అన్నారాయన భార్యవైపు చూస్తూ, ఆవిడ పక్క మీద కూర్చుంటూ.

రత్న ఒక్కసారి కళ్లు మూసుకుని బరువుగా నిట్టూర్చి కళ్లు తెర్చింది. జ్వరం తగ్గినా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఇంకా వేడిగానే వస్తున్నాయి.

"మా స్నేహితురాళ్లంతా పార్టీ ఇవ్వమంటు న్నారు నాన్నారూ, నాకు ప్రైజు వచ్చినందుకు" అన్నది జ్యోతి.

"అట్లాగేనమ్మా, డబ్బెంత కావాలో తీసుకు వెళ్ళు. మరి పార్టీకి నన్నూ, అమ్మనూ కూడా రమ్మంటావా" అన్నా రాయన నవ్వుతూ

"పొండి నాన్నారూ, నన్నూ, నా రచనలనూ చూస్తే మీకూ, అమ్మకూ ఎగతాళిగా ఉంది" అన్నది.

రత్న కూతురువైపు చిరునవ్వుతో చూసింది. ఆ నవ్వులో గత జీవిత స్మృతులు గతానుగతమై ఎన్నో విషయాలూ చూడగలిగారు జ్యోతి తండ్రి జ్యోతి మాత్రం నవ్వుతూ సంతోషంతో మేడ మీదికి వెళ్లింది.




"ఏరోయ్! ఈరోడ్డు ఎప్పుడు బాగుపడింది ? ఇదివరకు మోకాలోతు నీళ్ళుండేవిగా!"

జ్యోతి మనస్సు దొబూచులాడుతున్నది. ఈ శుభ వార్త రఘుకి చెప్పాలా, వద్దా అని.

టెలిఫోన్ డయల్ చేసింది.

"ఎవరు రఘూ'!'

"ఆ. నేనే. మై హార్టీ కంగ్రాట్యులేషన్స్ జ్యోతీ. ఇంతకుముందే ఆ వార్త విన్నాను. ఈ హడావుడిలో ఈ సంతోష సమయంలో నువ్వు ఉక్కిరిబిక్కిరయి నన్ను మర్చిపోయావనే అనుకున్నాను" అన్నారు రఘు అవతల నుంచి.

జ్యోతి నవ్వుకున్నది.

"అయితే పార్టీ ఎప్పుడని అడగవేం రఘూ."

"నాకు వేరే పార్టీ ఎందుకు జ్యోతీ. నువ్వు నా పార్టీవేగా. నీ దరహాసిత మందస్మిత వదనాలే నా క్కావలసిన పార్టీ. నీ తీయని మాటలే నాకు వెలలేని పార్టీలు. పార్టీలనేవి నీ పేరు చెప్పుకుని తినటానికే." అన్నాడు రఘు.

"నువ్వట్లా అంటావని నాకు తెల్సు. కాని పార్టీ యివ్వందే నా స్నేహితులంతా వప్పుకునే టట్లుగా లేరు. సాయంత్రం పిక్చరుకు పోదామా అయిదున్నరకల్లా మా యింటికి వచ్చెయ్యాలి సుమా. తెల్సిందా."

"తప్పక వస్తాను" అన్నాడు రఘు.

జ్యోతి రిసీవరు పెట్టేసి మళ్ళీ తల్లి దగ్గరకు వెళ్ళింది. తండ్రి ఆస్పత్రికి వెళ్ళిపోయారు.

"ఈ వార్తని రఘుకి ఫోన్లో చెప్పావా జ్యోతీ" అన్నది తల్లి.

జ్యోతి సిగ్గుపడుతూ తల్లివైపు చూసింది నీలిమబ్బులలో దోబూచులాడే పున్నమచంద్రుని వెన్నెల కాంతుల్లా ఉన్నది జ్యోతి మనస్సు. పి యు సి. ప్యాసయి బి ఏ. చదివే జ్యోతి ఎప్పుడూ చిన్న పాపాయిలా తల్లి ఒడిలోనే పడుకుని ముద్దు ముద్దుగా ముద్దు మాటలు మాట్లాడుతూ ఉండాలని అనుకుంటుంది. తల్లి దగ్గరకు వెళ్ళగానే పద్దెనిమిదేళ్ళ జ్యోతి పద్దెనిమిది నెలల బాల జ్యోతిగా మారిపోయి తల్లి వళ్ళోకి తల చేరుస్తుంది. జ్యోతి అట్లా వళ్ళో తలపెట్టి పడుకోటం తల్లికి కూడా ఇష్టమే. కారణం ఆమె నోములపంట జ్యోతి వక్కర్తే. ఆమె తరువాత ఇద్దరు పిల్లలు పుట్టి పురిట్లోనే పోయారు. అంచేత మరీ గారాబం జాస్తి.

"నా వెన్ను చలవ చాలా మంచిదమ్మా, అందుకనే పుట్టినవాళ్ళు పురిట్లోనే పోతున్నారు." అనేది జ్యోతి. తల్లి నవ్వుకుని జ్యోతి చెంపలు నిమిరి ముద్దు పెట్టుకోబోయేది. అంతలోనే ఇద్దరికీ సిగ్గు కలిగేది.

"అమ్మా, నేనే, బళ్ళోకి పోతున్నా, ఫ్యాన్ పిరియడ్లో వస్తానమ్మా. ఈలోగా జంతికలు జెగోడీలు వండుతావా" అనేది జ్యోతి కాలేజికి వెళ్తూ.

"నాకు తీరదుగానీ, ఓ అర్ధనా పెట్టి జీడీలూ వో అర్ధనా పెట్టి వేరుసెనక్కాయలూ కొనుక్కో తల్లీ" అంటూ పది రూపాయల నోటు ఇచ్చేది తల్లి రత్న. నవ్వుకుంటూ నోటు తీసుకుని వెళ్ళేది జ్యోతి. జ్యోతి అనే మాటలనే నెమరువేసుకుంటూ ఆనందించేది రత్న.

తన దృష్టిలో ఇంత చిన్న పిల్లగా ఉన్న జ్యోతి అంత పెద్ద నవల రాసి మొదటి బహుమతి సంపాదించిందంటే ఆమెకూ ఎంత సంతోషం కలిగినా, అంతరాంతరాల్లో ఏవో అయిష్టతగానే ఉంది. ఈ వూహలను పెరికితీసి జ్యోతి మనస్సు కష్టపెట్టదల్చుకోలేదు. కాని, ఆ సంతోషంలో జ్యోతితో సమంగా సంబరపడలేక పోతున్నది. అందుకు విచారపడుతున్నది రత్న.

"రఘూ, ఏమన్నాడు జ్యోతీ. ఇటీవల మన ఇంటికి రావడంలేదే" అన్నది రత్న.

"సాయంత్రం వస్తాడమ్మా. ఇవ్వాళ ఇద్దరం పిక్చరుకు పోతున్నాం. వెళ్ళమా అమ్మా" అన్నది జ్యోతి.

రత్న మనస్సు అంగీకరించినా ఆమె మానసిక పథంలో ఏవో రెండు మబ్బులు కమ్ముకున్నా ఆ మబ్బులు తేలిపోయేవే నని ఆమెకు తెలి మనస్సు మాత్రం అంత తేలికగా సమ పట్టంలేదు.

"మాట్లాడవేం అమ్మా. రఘుతో సినిమాకి వెళ్లమంటావా" అన్నది మళ్లీ జ్యోతి.

"నేనేం చెప్పేది జ్యోతీ. నీ అభిమతం ఎట్లా ఉంటే అట్లాగే చెయ్యి." అన్నది రత్న నిర్లిప్తతగా. తల్లి మనస్సులో సంకోచమేమిటో జ్యోతికి అర్థంకాలేదు.

చెప్పినట్లుగానే సాయంత్రం అయిదున్నర కల్లా వచ్చాడు రఘు.

"స్వాతి వానకు ఎదురుచూసే ముత్యపు చిప్పలా నీకోసం కళ్లింతవి చేసుకుని రెప్ప వార్చకుండా చూస్తున్నా రఘూ" అన్నది జ్యోతి.

"అంత వానలో నువ్వు తడిస్తే జలుబు చేస్తుంది జ్యోతీ. నిన్నసలు వానలో ఎంతమాత్రం తడవనివ్వను" అన్నాడు రఘు.

ఇద్దరూ నవ్వుకున్నారు.

అక్షరాభ్యాసం చేశాక అక్షరాలు నేర్చుకుంటారు. ఒకటో క్లాసులో పేర్లు నేర్చుకుంటారు. రెండో తరగతిలో చిన్న చిన్న పాఠాలు. హైస్కూలు తరగతుల్లో అనేక రకాల పుస్తకాలు. కాలేజీ చదువులో సరేసరి. జీవితగమనంలోనూ అంతే.

జ్యోతి రఘు స్నేహంలో పేర్ల పుస్తకం పట్టింది. హైస్కూలు తరగతుల్లో చేరాలని ఆరాటపడుతున్నది. కాని, మిగతా క్లాసులు కూడా పాసయితేనే కదా హైస్కూలు తరగతుల్లో చేరేది?

కొందరికి చదువుల్లో ఫస్టు మార్కులు వచ్చినా లోకజ్ఞానం తక్కువ. కొందరికి చదువుల్లో థర్డు క్లాసులో మార్కులు వచ్చినా, అంటే పది లోపలనే మార్కులు వచ్చినా లోకజ్ఞానంలో పట్టభద్రులు మాదిరే ఉంటారు వారి జీవితాలు వారికి రాణింపుగా కనపడినా ఇతరులకు తెలివి హీనులుగానే కనబడుతారు.

రఘుకి కాలేజీలో మంచి పేరు ప్రఖ్యాతులున్నయ్యి. పి యు సి. లో ఫస్టుక్లాసులో ప్రప్రథమముగా ఉత్తీర్ణుడయ్యాడు. సరస్వతీదేవి అతని నాలుకమీదనే నాట్యమాడుతుందంటారు అంతా. కాని, సభాపిరికి. నల్గురిని పదిమందిలో మాట్లాడలేడు కాలేజీ వక్తల్లో అతని పేమాత్రం పేరు లేదు కనీసం ఒక్క డిబేటులోనైనా అతను పాల్గొన లేదు ఒక్క నాటకంలోనూ అతను ఏ చిన్న పాత్రా ధరించలేదు. ఏదయినా వస్తువుని వివరించమని ప్రశ్న సాగించమంటే చెమటలు పట్టేవి. అదే వ్యాసం రాయమంటే పెన్‌లో సిరా పోసుకొని దస్తా తెల్ల కాగితాలూ గంటలో వ్రాసి నూటికి నూరు మార్కులు తెచ్చుకుంటాడు. అట్లాంటి రఘుకి జ్యోతి ఒకరోజున అనుకోకుండా పరిచయమైంది

రఘు తండ్రి రంగనాయకులుగారు పెద్ద వ్యాపారస్థులు. అయిదారు లక్షల ఆస్తి గడించారు తాహతుకు తగినట్లుగా విరివిగా దానధర్మాలు చేశాడు. "ధార్మిక కేసరి" అనే బిరుదు తెచ్చుకున్నాడు భార్యపేరు నాగమణి. ఆవిడకు పుట్టెడు చెవుడు. తల పగలకొట్టుకున్నా వినిపించదు చెవులు వినిపించేటందుకు మిషన్ కొనిస్తానన్నా, ఆవిడ ఎన్నోసార్లు వద్దన్నది ఆవిడకు చెవిటిదానివంటే పిచ్చిమంట. అమిత కోపం వస్తుంది. తను చెవిటిది కాదనుకోవాలనే ఆవిడ అభిలాష. అందుకనే ఆవిడకు చెవు మిషన్ కొనిస్తానన్నా వద్దన్నది.

ఒకరోజున ఆవిడ నాటకానికి వెళ్లింది. అదొక

# పసిడి మనసులు

పౌరాణిక నాటకం. మూడువందల పద్యాలు ఏదో సంస్థ సహాయార్థం అనటంనుంచి వంద రూపాయల టిక్కట్లు అంటగట్టారు. ధార్మిక కేసరి గనుక రంగనాయకులుగారు అవలీలగా టిక్కట్లు కొని, నిద్రకాస్తూ తను కూర్చోలేక భార్యను వెళ్లమన్నాడు. ఆవిడ అంచేత ఆరోజున ఆ నాటకానికి వెళ్లింది.

జ్యోతి తండ్రి డాక్టరు కావడం నుంచి ఆయనకు ఎవరో ఒక టిక్కెట్టు యిచ్చారు ఆ టిక్కెట్టుతో వచ్చింది జ్యోతి

రంగనాయకులుగారి భార్య నాగమణి, డాక్టరుగారి కూతురు జ్యోతి ఒకరిపక్కన ఒకరు కూర్చున్నారు.

"నాటకం ప్రారంభమయ్యేసరికి పదవుతుందేమో" అన్నది జ్యోతి.

"సన్నారగపులేమ్మా. మావారికి పెద్ద వ్యాపారం. నాపేరు నాగమణి ఏమిటో పూర్వకాలం పేరు" అన్నది ఆవిడ.

ఈ సమాధానానికి నవ్వొచ్చింది జ్యోతికి ఏదో పరాకుగా ఆవిడ అట్లా అన్నదేమో నని అనుకుంది ఎవరూ మాట్లాడకుండా కూర్చున్నారు. నాటకం ప్రారంభమైంది.

"ఈ చమ్కీ గౌన్లూ, జరీ తలపాగాలూ, అట్ట కిరీటాలూ ఈ మహానటులు ఇంకా ఎన్నాళ్ళు ధరిస్తారో" అన్నది జ్యోతి ఆవిడతో.

"నా చిన్నతనంలోనూ ధర సింహాసనమై, నభంబు గొడుగై అనే దసరా పద్యాలు పాడేవాళ్ళమ్మా. నేనూ అట్టకోతి పుచ్చుకుని పంతుళ్లతో చిన్నప్పుడు తిరిగాము." అన్నదావిడ

జ్యోతికి నవ్వు ఆగలేదు. ఆవిడకు బ్రహ్మాండమైన చెవుడు కామాలని వెంటనే తెల్సుకుంది. గట్టిగా, దగ్గరగా మాట్లాడితే పక్కవాళ్ళు విసుక్కుంటారని ఇంక మాట్లాడదల్చుకోక ఊరుకున్నది.

"శ్రీకృష్ణ పాత్రధారి ఫరవాలేదు. కంఠం చాలా బావుంది" అన్నది మెల్లిగా ఇటుపక్కన కూర్చున్న ఇంకో అమ్మాయితో. తననే నిందించింది కామాలనుకుంది ఆవిడ.

"మాబ్బాయి పేరు రఘు. వాడేమిటో, వాడి చదువేమిటో. వాడి కిష్టేమి పట్టవుకదా" అన్నదావిడ.

జేబు రుమాలు నోటికి అడ్డం పెట్టుకుంది జ్యోతి ఇంక ఆవిడతో మాట్లాడదల్చుకోలేదు.

నాటకం పూర్తయింది. అంతా వెళ్లిపోయారు. ఆవిడ కుర్చీలోంచి లేవలేదు. తిరా చూస్తే గురక పెట్టి నిద్రపోతున్నది. చెయ్యి తట్టి నిద్రలేపింది జ్యోతి.

"మీరు వంద రూపాయల విలువగల నిద్ర పోయారు. అదృష్టవంతులు. అందరికీ అలాంటి యోగం సిద్ధించదు" అన్నది జ్యోతి పెద్దగా.

"ఒక్కదానివి పోటానికి భయమంటావా. మా కార్లో నిన్ను మీ యింట్లో దిగడిచే పోతాను. చిన్నవాళ్ళు ఒంటరిగా రాకూడదమ్మా" అన్నదావిడ.

వద్దన్నకొద్దీ ఆవిడ తన కార్లోనే జ్యోతిని ఎక్కించుకొని ఇంటివద్ద దిగబెట్టింది.

"నమస్కారమండీ. మీకు శ్రమ ఇచ్చాను" అన్నది. జ్యోతి ముకుళితహస్తాలతో ఆవిడకు నమస్కరిస్తూ.

"మావారి పేరా ... ఎట్లా చెప్పేదమ్మా ... ధార్మిక కేసరి వారి బిరుదు" అన్నదావిడ.

నవ్వుకుంటూ ఇంట్లోకి వెళ్లింది జ్యోతి.

(సశేషం)






"తోకలాగేను ధూమకేతుక్ష్మాభ జనులకు" ఈ ఏమిటీ? ధూమకేతుక్ష్మాభా ? పెద్దన గారే ? అప్పటికి ధూమకేతువు గ్రహాలవంటి వస్తు విశేషమే నన్న గ్రహింపు రాలేదన్నమాట."

"పెద్దనగారు ఎప్పటి వారూ?"

"కృష్ణదేవరాయలు 1524 ప్రాంతంలో కాబోలు చచ్చి పోయాడు అప్పటికి పెద్దనగారు వ్రాసే ఉండినారు కదా మనుచరిత్రము?"

"అప్పటికి పాశ్చాత్య దేశాలవారికి తెలిసిందా తోకచుక్క అమార్గగామి అయినవస్తువేనని ?"

"లేదు. 1682 లో ఇంగ్లండులో కనపడిన తోకచుక్క మహాకాశములో ఏకక్ష్యతో తిరుగుతున్నదో వేధ చేసి కనుక్కున్నాడు హేలీ. అతనికి ముందు కెప్లరు, గ్రహముల కక్ష్యలు దీర్ఘ వృత్తాలని కనిపెట్టాడు. న్యూటను ఆగోళాల నడుమ ప్రవర్తిల్లే ఆకర్షణ ఈ సూత్రాన్ని అనుసరించి వుంటుందని చెప్పేడు. ఈ రెండు ఆధారాలతోనూ హేలీ తాను పట్టిన 1682 నాటి తోకచుక్క తిరిగే కక్ష్యను లెక్కవేసి కనుక్కున్నాడు ఈ కక్ష్య, ఆ 1682 సంవత్సరానికి పూర్వము, సుమారు 76 సంవత్సరాలకు ఒకమారు చొప్పున గోచరిస్తూండిన కొన్ని తోకచుక్కల దారి ఒకే రీతిగా ఉండినట్లు గుర్తించాడు గ్రహాలు తిరుగుతూన్నట్లే ఈ 1682 నాటి తోకచుక్క కూడా సూర్యుడి చుట్టూ 76 సంవత్సరాల కొకమారు చొప్పున తిరుగుతూన్న దన్నాడు దానితో, 76 సంవత్సరాల అంతరముతో పూర్వ శతాబ్దాలలో మళ్లీ మళ్లీ కనిపిస్తూండిన తోకచుక్కలన్నీ ఈ 1682 తోకచుక్క దర్శనాలే కాని, వేర్వేరు తోకచుక్కలు కావని తేలిపోయింది. ధూమకేతువు అరిష్టకారి అయిన రాక్షసి ఏమీ కాదు, మహాకాశంలో విస్మయంగా విశృంఖలంగా తిరిగే వస్తువు ('గోళము' కాదుగదా ? అందుకే 'వస్తువు' అన్నాను)

ఇంకా విచిత్రము వినండి. ఆ తోకచుక్క తోక చాలా దీర్ఘమైనది సూర్యుడికీ, భూమికీ గల దూరము 9 కోట్ల 30 లక్షల మైళ్ళు. ఈ తోకచుక్క తోకపొడవు అంతకన్నా ఎక్కువ! ఈ తోకను చూసే పూర్వులు —అన్ని దేశాలవారూ— ధూమకేతువు అపాయకారి అని జడిశారు. 1910 లో కనిపించిన తోకచుక్క ఇదే! తోక విస్తరించే కొండచీపురు రూపంలో కనబడిందట అది 21—5—1910 నాడు దాని తోకలోని ధూమములోనుంచి మన భూమి దొర్లుకు పోయింది. భూలోకవాసులకు ఏ అపాయమూ జరగలేదు! 1861 వ సంవత్సరంలో కూడా ఇంకొక తోకచుక్క తోకలోంచి భూమి దూసుకుపోయింది. దూసుకు పోవడ మవగానే తోక అటంకమేదో లెక్కకు వచ్చేదని అనుకునేరు కాబోలు, ఏమిలేదు. అతి పలుచని ధూమ మది. ఆ ధూమము మొత్తమ్మీద సూర్యుడికి వ్యతిరేక దిశలో ఉంటుంది. తోకచుక్క మూడు భాగాలని ఊహించవచ్చు. తలచుక్క, దానిచుట్టూ వెలుగుముద్దవంటి తలా, తోకానూ. ఈ తోక అన్నది, తోకచుక్క సూర్యుడిచుట్టూ తిరుగుతూన్నంతసేపూ, మొత్తపు దారి అంతటా, సూర్యుడికి వ్యతిరేక దిశలోనే ఉంటుంది. సూర్యుని వెల్తురు తోపిడికి తోకచుక్కల తోకలు వెనుక వైపుకి సర్దుకుంటాయి

తోకచుక్కల కక్ష్యలు చాలా పొడవైన దీర్ఘ వృత్తాలు. ఇంచుమించు 'ఏత్వము' లో ఉన్నంత వక్రతా ఉంటుంది తోకచుక్కలు సూర్యుడికి చేరువగా తిరిగే దారిలో. కొందరు జ్యోతిశ్శాస్త్రజ్ఞు అంటారుగదా, "కొన్ని తోకచుక్కలు ఒకమారు కనబడి వెళ్లిపోతే మరి కానరావు" అంటారు వాటి కక్ష్యలు నిండి బద్ద ఆకారంలో ఉండి, సుదూరాకాశంలో వ్యాపించి మరి చేరుకుని మూయకపోవట మూసుకుపోయి అతి దీర్ఘ వృత్తాకార కక్ష్యలో తిరగితేరే గదా అవి మళ్లీ తిరిగి తిరిగి వస్తూండడము కనబడుతూండడమూను ?

1811 లో కనబడిన తోకచుక్క మళ్లీ 4800 సంవత్సరంలోగాని తిరిగి రాదట 1910 లో కనబడ్డ హేలీ తోకచుక్క తిరిగి 1985 ప్రాంతంలో కనబడుతుంది.

"ప్రాంతంలో అని అంటున్నారే ?"

"అది పూర్వ శతాబ్దాలలో 75 లేక 76 సంవత్సరాలకు ఒకమారు చొప్పున కనబడింది.

"ఎందు కలాగ తేడాతో తిరిగింది ?"

"ఈ తోకచుక్క తిరిగే దారికి చేరువగా శని గ్రహమూ, గురు గ్రహమూ ఉండడము తటస్థించిందట. అవి లాగడమువల్ల దీని కక్ష్య కొంత మారి, ఆ తేడాకి కారణమైంది. మళ్లీ 1985 ప్రాంతానికి దీని దారికి గ్రహముల సామీప్యము ఎంతమాత్రము ఉంటుందీ అన్న దానినిబట్టి ఉంటుంది. ఇది గోచర మయ్యే కాలము."

"హేలీది గొప్ప పరిశోధన"

"తోకచుక్క దారిని తెలుసుకోవడము కన్న అతని పరిశోధనా ప్రయోజనము గొప్పది ఇది మళ్లీ— మళ్లీ లెక్క ప్రకారము వచ్చేటిది. మరి దీని ఆగమనము అరిష్టసూచక మనుకోడము ఎలాంటిది ?"

"దాని నైజము తెలియని నాటి భయము."

"సరిగ్గా అంతే. స్ఫోటకము అమ్మవారి వల్ల వస్తుందనుకోడమూ అలాటిదే పిచ్చి నమ్మకా లంటారు వైజ్ఞానికులు ఇలాటివాటిని. ★




పక్క జిల్లా ముఖ్యకేంద్రం నుంచి అనాథ శిశు శరణాలయానికి ప్రారంభోత్సవం చెయ్యవలసిందిగా వచ్చిన ఆహ్వానాన్ని పురస్కరించుకొని, 'రైలుకి ఇంకో అరగంటే టైముంది' అనుకుంటూ ప్రొఫెసర్ దయానిధి బయల్దేరారు, పది రూపాయల నోటుంచిన పర్సు లాల్చీ జేబులో పెట్టుకుంటూ కంగారుగా.

సరిగ్గా దయానిధి రిక్షాని పిలిచి "స్టేషన్‌కి త్వరగాపోనియ్..... పదిరూపాయల చిల్లర ఉందా?... పర్లే.. స్టేషన్‌లో మార్చి ఇస్తా", అంటూ బయల్దేరిన సమయంలోనే, ఊరికింకో మూలనున్న పూరిగుడిసెలోంచి బరువుగా బాధగా బయలుదేరాడు రంగడు ఫలానా చోటికంటూ నిర్ణయించుకోకుండా తనకాళ్ళు ఎలా తీసుకువెడితే అలాగే శూన్యంగా నడుస్తున్నాడు. అసలే నీరసంగా ఉన్నాయి వాడికళ్ళు. దానికితోడు నీళ్ళతోటి కూడా నిండాయేమో, దారినంతా మసగ మసగ్గా ఎగుడు దిగుడుగా చూపిస్తున్నాయి.

కడుపులో ఏదో బాధ. మరేదో భయం. నాటి తాలూకు నీడలన్నీ ఒత్తుగా పరుచుకొని, పట్టుమని పదిహేనేళ్ళయినా నిండని ఆ పసివాడి మనస్సు చుట్టూ ముసురుకుంటున్నాయి. రంగడికి లోకం అంతా అంధకారమవుతున్నట్లనిపించింది.

నాన్నలాగే అమ్మకూడా చచ్చిపోతుందా?

ఈ ఆలోచనతో వాడికడుపులో ఏదో దేవినట్లుయింది. తల తిరుగుతోంది. దాంతోపాటే లోకం గాడా ఒక్కమారు గిర్రున తిరిగింది. గొంతుక

లోంచి ఉబికి ఉబికి వస్తూన్న దుఃఖాన్ని పెదిమ, పంటికి మధ్యన బిగించాడు. కట్టలు తెంచుకొని వస్తూన్న కన్నీళ్ళని, మాసిపోయి చిరిగిపోయిన చొక్కా చేతులో తుడుచుకున్నాడు. పరిగెట్టుకుని ఎక్కడికేనా పారిపోయి గట్టిగా బావురుమని ఏడవాలనిపించింది వాడికి.

అమ్మ చచ్చిపోతుందా?

డాక్టరుగారు రాసిచ్చిన ఆ మందు కొనకపోతే ఇంక అమ్మ తనకు కనిపించదూ? ..... మందు కొంటే? ... అమ్మ బతుకుతుంది .... అయితే ఎలాగైనాసరే డబ్బు సంపాయించి ఆ మందు కొనాలి.

అంత బాధలోనూ రంగడికి నవ్వు వచ్చింది.

ఇవాళ్టికి మూడు రోజులయింది, డాక్టరు గారిచీటీ రాసి ఇచ్చి. తను ఇప్పటికి కొనగలిగాడా? ఏ రోజు దినపత్రిక అమ్మినకూలి, ఆ రోజునే పట్టుకెళ్ళి పోతూండటం మూలాన, యజమాని ఒక్క పయా పైసైనా అడ్వాన్సు ఇచ్చేది లేదన్నాడు. పోనీ, ఏ కొట్లోనేనా మందు అరువిప్పించడని బతిమాలితే, 'ఏడెనిమిది రూపాయలు ఖరీదు చేసే ఈ మందు నిన్ను నమ్మి ఏ కొట్లో అరువిప్పించమంటావ్?' అంటూ గదమాయించాడు.

అమ్మ పనిచేసే అయ్యోరింటికి వెళ్ళి చూశాడు రంగడు ఇల్లు తాళం వేసి ఉంది. వాళ్ళు తిరుపతి వెళ్ళారు. వారంరోజులు దాకా తిరిగిరారు అంటూ చెప్పింది పక్కింట్లో దాసీది ఎవర్నడిగినా లాభం లేకపోయింది. ఎంతమంది కాళ్ళో పట్టుకున్నాడు ఎన్ని కొట్లలోనో అడిగి చూశాడు. ఉహు. ఆఖరికి ఏడుస్తూ డాక్టరుగారి దగ్గరకెళితే, "వైద్యమయితే ఊరికే చేస్తానుకాని, మందు ఎక్కడ కొని ఇయ్యమంటావ్? పోనీ ధర్మాసుపత్రికి తీసుకుపో వాళ్ళు రంగు నీళ్ళు కలిపి పోస్తారు అదృష్టముంటే బ్రతుకుతుంది" అన్నారు.

ధర్మాసుపత్రికా?

నాన్నను చంపేసిన ఆ ఆసుపత్రికి మళ్ళీ అమ్మను తీసుకెళ్ళడమా!

రంగడికి భయంతో ఒళ్ళు ఝల్లుమంది.

ఉహు. ఏమైనాసరే డబ్బు సంపాయించి ఆ మందు కొనాలి. అమ్మను బతికించుకోవాలి.

అమ్మ!

రోజూ వేళ్ళతో తన తలదువ్వి ముద్దు పెట్టుకొని, అయ్యోరింట్లోంచి తెచ్చినదేమైనా ఉంటే తనకే పెట్టి, దేవుడి కథలు చెబుతూ తనని నిద్దరో గొట్టేది. ఇప్పటికి అమ్మ కన్నెత్తి చూసి, తను పలకరించి వారంరోజులయింది ఆ కుక్కి మంచంలో ఎముకల పోగులా పడుకొని, మూలగడం తప్ప ఏమీలేదు. నిన్నా ఈవేళా ఆ మూలుగు కూడా మానేసింది. అందుకే రంగడికి భయంగా ఉంది

ఏమైపోతుందో అమ్మ!

చొక్కాతో కళ్ళు తుడుచుకొని స్టేషను వైపుగా నడవసాగాడు రంగడు, నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ. స్టేషను దగ్గర రిక్షాలోంచి, ఎవరో పెద్దమనిషి కంగారుగా దిగడం చూశాడు రంగడు. ఆయన లాల్చీజేబు చిల్లులోంచి పర్సు జారడం కనిపించింది వాడికి. అది కింద కూడా పడింది ఆ పెద్దమనిషి అది చూసుకున్నట్లు లేదు. కంగారుగా టిక్కెట్లిచ్చే కొంటరు దగ్గరకెళ్ళి పోయాడు. ఆయన రిక్షావాడు కూడా ఇటు పర్సుపడిన సంగతే గమనించకుండా అలా రెండడుగులు నడిచి ఆ పెద్దమనిషి వెళ్ళిన దిక్కుగానే చూస్తున్నాడు. పర్సు రిక్షా దగ్గర పడి ఉంది. ఎవ్వరూ చూడటం లేదు. అయితే మాత్రం? — అమ్మో! రంగడి గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. ఆ పర్సులో అమ్మ ప్రాణాన్ని నిలబెట్టే 'డబ్బు' ఉండొచ్చు. ఆఁ!.... నిజమే!.... వాడి హృదయంమీంచి ఏదో పెద్ద బరువు తీసేసినట్లయింది. 'ఆశ', వాడి కాళ్ళను గబగబా పర్సు దగ్గరికి నడిపించింది. కాని తీరా ఒంగుని పర్సు తీయబోయేటప్పటికి వాడి చేతులు వణికాయి. ఏదో కొత్త భయం రంగడిని ఆవరించింది. బెదురుతూ ఇటూ అటూ చూశాడు. సరిగ్గా అదే సమయంలో రిక్షావాడు తనవైపు చూశాడు. క్షణంలో సగం, రంగడిలోకి ఏదో చెప్పలేని సాహసంతో కూడిన మొండితనం ప్రవేశించింది. అది వాడిచేత పర్సుని తీయించింది. వెంటనే కంగారుగా దానిని చిరిగిన చొక్కా కింద దాచుకుంటూ తడబడే అడుగులతో తొందరగా పక్క సందులోకి తప్పుకున్నాడు రంగడు పాపం, ఆ కంగారులో పడుతున్న అవస్థనేనా గమనించకుండా.

అమ్మని బతికించుకోవాలనే ఆదుర్దా, అందుకు తగిన డబ్బు సంపాదించుకో గలిగామనే సంతోషం, ఆ సంతోషాన్ని తనకు కలిగించిన భగవంతుని పట్ల కృతజ్ఞత — వీటన్నిటితోటీ, లేని ఉత్సాహాన్ని తెచ్చుకుని రంగడు నాలుగంగల్లో మందుల షాపు చేరుకున్నాడు. అప్పటికి మూడు రోజుల నుంచి చొక్కాజేబులో అతిభద్రంగా దాచుకున్న మందు చీటీ కొట్టువాడికి చూపించాడు. బాగా నలిగిపోయిన ఆ కాగితం మీది అక్షరాలు నెమ్మదిగా కూడబలుక్కుంటున్న మందులషాపువాడి ముఖంలోకి ఆదుర్దాగా చూశాడు రంగడు, ఆమందు ఎక్కడ లేదంటారో అనే భయంతో. కొట్టు అతను రంగడి వాలకాన్ని ఎగాదిగాచూసి "మందు అయితే నా దగ్గర ఉంది. డబ్బు నీదగ్గర ఉందా?" అన్నాడు.

"ఓ" అంటూ రంగడు గర్వంగా చొక్కా అడుగునుంచి పర్సు తీసి చూపించి, "ఇదిగో పర్సు" అన్నాడు.

"పర్సు సరేనయ్యా అందులో డబ్బు ఉందాఅని. ఎనిమిది రూపాయలుండాలి మరి"

ఆమాటతో రంగడు గతుక్కుమన్నాడు. అవును నిజమే. ఉత్త పర్సేమో! . గుండెలు కొట్టుకుంటూ ఉంటే, వణుకుతూన్న చేతులో, పర్సు తీసి చూశాడు. రంగడి కళ్ళల్లో జిగేల్మని వెలిగిన కాంతిచూసి, నమ్మకంతో కొట్టువాడు మందుని రంగడి చేతిలో పెట్టాడు

ఎంతో భారం తీరినట్లు దీర్ఘంగా శ్వాస వదిలి ఆమందు సీసాను గట్టిగా గుండెలకి హత్తుకున్నాడు రంగడు.

హమ్మయ్య!

ఇంక ఫరవాలేదు. మందు దొరికింది. అమ్మ బతుకుతుంది. సంతోషంతో ఒళ్ళు మరచిపోయి ఒక్కక్షణం ఆనందమయమైన ఆలోచనా ప్రపంచంలో హాయిని పొందుతూన్న రంగడు కొట్టువాడి హెచ్చరిక విని ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు. వస్తూనే పర్సు తీశాడు, మందు మూల్యం చెల్లించడంకోసం..........

దయానిధి పడుతూన్న కంగారు చూసి, "ఏటి బాబూ?" అని అడిగాడు రిక్షావాడు, ఏడికేం సమాధానం చెప్పకుండా, దయానిధి ఇంకోసారి లాల్చీజేబులు రెండు చేతులోటే తడుముకున్నారు. మరోమారు కౌంటరుకీ రిక్షాకీ మధ్యనున్న స్థలమంతా పరకాయించి చూసి, రిక్షా దగ్గరకొచ్చి సీటు కిటూ అటూ వెతికారు.

"ఏటి బాబుగారూ? ఏదైనా పోయిందా?" అన్నాడు రిక్షావాడు మళ్ళీ.

కళ్ళతో చుట్టుపక్కలంతా పరికిస్తూ "అవునురా. పర్సు పోయింది. రిక్షాలో వస్తూన్నప్పుడు జేబులోనే ఉంది. ఇప్పుడే పడిపోయి ఉంటుంది. ఈ జేబుకి పెద్ద చిల్లు ఉంది. చూసుకో లేదు. తిరిగి ఇంటికి వెళ్ళి రావడానికి టైము లేదు. ఈ రైలు తప్పితే పట్నంలో సభకి అందుకోలేను" అన్నారు దయానిధి.

"పర్సా అండీ?..." అదే కాబోలు. ఇప్పుడే ఎవరో కుర్రాడు ఇక్కడ ఒంగుని తీశాడు. అదేటో అనుకున్నా.

"ఎవరూ?... కుర్రాడా?...ఏడీ?... ఏటు వెళ్ళాడూ?" అంటూ ఆదుర్దా పడుతూన్న దయానిధితో, "అదుగో, ఆసందు మలుపు తిరిగాడు. ఎంతదూరం పోగలడులెండి. సందు చివర ఉన్న మందులషాపులు దాటకుండా మనం వాడిని పట్టుకోవచ్చు. రిక్షా ఎక్కండి" అంటూ తను కూడా రిక్షా ఎక్కి రయ్యిమని సందుమలుపు తిప్పించాడు రిక్షావాడు .........

వీపుమీద బలమైన చెయ్యి పడడంతో, అదరిపడి రంగడు వెనక్కి తిరిగి చూశాడు. వాడి పై ప్రాణాలు పైకి పోయాయి.

ఆయనే! .. ఆపర్సు యజమాని!

తనవేపు క్రూరంగా చూస్తూ కర్కశ స్వరంతో "ఊఁ! పర్సు ఇలా ఇవ్వు" అన్నారు.

"నీ బాబుగారి ముల్లె అనుకున్నావురా?.. ఊ . దెబ్బలు తినకుండా ఇచ్చెయ్యి" అని గద్దించాడు రిక్షావాడు. రంగడి ప్రాణానికి వాళ్ళిద్దరూ యముడూ, యమదూతలాగ కనిపించారు.

నిశ్చేష్టుడై అలాగే నిలబడిపోయి ఉన్న రంగడి చేతిలోంచి, దయానిధి పర్సులాక్కోవడం, కొట్టువాడు మందులాక్కోవడం, రెండూ ఒక్కసారే జరిగాయి. అమ్మ ప్రాణాల్ని అలా బలవంతంగా లాగేసుకున్న, వాళ్ళ ఇద్దరి కాళ్ళమీదా చాప చుట్టగా పడిపోయి, "మా అమ్మని బతికించండి . ఈమందు లేకపోతే మాఅమ్మ........" ఆపైన అనలేక భోరున ఏడ్చేశాడు రంగడు.

"ప్రతివాడికీ ఏడవడం ఓనాటకం అయిపోయింది పోనీరా రిక్షా" అంటూ దయానిధి రిక్షాలో స్టేషనువైపు వెళ్ళి పోయారు. గుండెల్లో లేచిన మంటలకి కళ్ళల్లో ఉన్ననీళ్ళుకూడా ఇగిరిపోగా గాజుకళ్ళతో దయానిధిగారు వెళ్ళిన రిక్షాకేసే చూస్తూ నిలబడిపోయాడు రంగడు లోకం పోకడ తెలియని ఆ కుర్రవాడి కంటికి క్రూరంగా కనిపించిన దయానిధి, స్టేషన్ చేరుకోగానే కృతజ్ఞతో కూడిన సంతోషంతో రిక్షావాడికో రూపాయి బహుమతిగా ఇచ్చి రైలెక్కారు, మొత్తానికి అక్కడ అనాథ శరణాలయోత్సవానికి అందుకో గలుగుతున్నాననే ఉత్సాహంతో.

* * *

ఇక్కడ అనాధగా మిగిలిపోయాడు రంగడు అమ్మలేని ఆ పూరి గుడిసెలో. చీకటేగా మారిన ఈలోకంలో తాను ఏకాకినయి పోయాననే బాధతో

పూర్తిగా అర్థం అయేటప్పటికి రెండు రోజులు పట్టింది వాడికి ఈరెండు రోజులనుంచి ఓమూల నున్న గోనెపట్టా మీద పడుకొని ఏడుస్తూనే ఉన్నాడు ఆ ఏడుపులోనే మధ్యమధ్య కొద్దిగా కునుకు పట్టేది వాడికి. శరీరమూ ప్రకృతి కలిసి దయ తలచి, ఆ అనాథకి ప్రసాదించిన ఆకొద్ది క్షణాల శాంతినీ కూడా భగ్నంచేసేవి, ఏవేవో భయంకరదృశ్యాలు కలలోకి వచ్చి—

ఆ చుట్టుపక్కల పాకలలో వాళ్ళు వచ్చి బల వంతంగా అమ్మని తన దగ్గర్నుంచి లాక్కుని, ఎక్కడికో మోసుకొని పోయిన దృశ్యం కలలో కన్పించే టప్పటికి, ఉలిక్కిపడి లేచి, "అమ్మా! అమ్మా!" అంటూ ఏడ్చి ఏడ్చి, మళ్ళీ సొమ్మసిల్లి పోయాడు రంగడు.

వాడికి స్పృహ వచ్చేటప్పటికి బాగా బారెడు పొద్దు ఎక్కింది.

ఇన్నాళ్ళూ రక్షణ ఇచ్చిన ఆ పాక, మొన్నరాత్రి వచ్చిన పెద్ద తుఫానుకి, ఆకులన్నీ పోగొట్టుకొని, సూర్యుని తీక్షణమైన కిరణాలు రంగడిని నిర్దాక్షిణ్యంగా హింసిస్తూంటే చూస్తూ తనకేం పట్టనట్టు నిర్లిప్తంగా నిలబడి ఉంది.

పైన ఎండ మాడ్చేస్తోంది.

లోపల ఆకలి దహించేస్తోంది.

# దయ ఖరీదు

అమ్మ పోయిందని ఓమూల పడుకొని తను ఒళ్ళు తెలియకుండా ఏడుస్తూంటే, పక్కింటి అవ్వకేకలేసి రెండురోజుల క్రితం గుక్కెడు గంజి తనచేత తాగించింది. అంతే!. మళ్ళీ ఎవరూ తనని పలకరించనూ లేదు. తను పాకదాటి బయటకు పోనూలేదు.

కడుపు మాడి పోతోంది.

అది అమ్మ పోయిన బాధో, ఆకలి బాధో అంతు చిక్కలేదు వాడికి. అమ్మలేకపోయినా తనకి ఆకలి వేయడం చిత్రంగా అనిపించింది అవును. ఇప్పుడు అమ్మలేదుగా?.... అమ్మ బదులూ తన బదులూ కలిసి ఏకంగా తనకే వేసేస్తోంది ఆకలి. రంగడు బాధగా అటూ ఇటూ దొర్లాడు. కడుపులో మంట, బాధ— ఇంక లాభంలేదు. ఏదో ఇంత తినాలి. అయిష్టంగా లేచాడు రంగడు. . ..

"చెప్పకుండా ఈ నాలుగు రోజులూ మానేస్తే నీపని ఎవడు చేస్తాడనుకున్నావ్? పరే—మీ అమ్మ పోయిందన్నావు కనక క్షమిస్తున్నాను. ఇదిగో పేపర్లు— అమ్మకురా— మామూలుగా నీకిచ్చే పావలా ఇస్తాను" అన్న యజమాని ముఖంలోకి దీనంగాచూసి దినపత్రికలకట్ట అందుకున్నాడురంగడు.

యజమాని సెలవు ప్రకారం, "దయానిధి గారి అనాథ శరణాలయ ఉపన్యాసం— విడిప్రతి ఏడు పైసలు" అంటూ నీరసంగా అరుస్తూ పత్రికలు అమ్ముతున్నాడు రంగడు.

ఇంతలో ఓ పెద్దమనిషి ఆయన, రిక్షాని తన పక్కనే ఆపు చేయించి, పది నయా పైసల బిళ్ళ తన చేతిలో పెట్టి ఆతురతగా పత్రిక తీసుకున్నాడు. తను మూడు పైసలూ తిరిగి ఇచ్చేలోగానే రిక్షా కదిలింది. "ఇదిగోనండి మూడు పైసలు" అంటూ అరుస్తూ తను రిక్షా వెనక పడ్డాడు. ఆయన రిక్షాలోంచి వెనక్కి తిరిగి నవ్వుతూ, "అక్కర్లేదులే. అవి నువ్వు తీసుకో" అంటూ తన మీద దయామృతాన్ని కురిపించారు.

రంగడు తెల్లబోయి ఆయన కేసి చూశాడు.

ఆ య .నే .!

ఆరోజున పది రూపాయల పర్సుతోపాటు అమ్మ ప్రాణాల్ని కూడా తన దగ్గర్నుంచి బలవంతంగా లాక్కుని పట్టుకు పోయినాయన.

"ఇవాళ ఆయన దయ విలువ పది నయా పైసలు. అందులో తన వాటా మూడు పైసలు." రిక్షా వెళ్ళిన వంకే గుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయి ఉన్న రంగడి చేతిలోంచి, జారి కన్నీళ్ళతో కలిసిపోయాయి, ఆ మూడు పైసలూను—




ఒకరోజున కాజీదగ్గరికి చిత్రమైన ఫిర్యాదు వచ్చింది. దానినెలా పరిష్కరించాలో అర్థంగాక ఆయన మౌల్వీనసిరుద్దీన్ సహాయంకోరాడు. ఆ కథ చెప్తావినండి.

ఒకరోజున ఇద్దరు మనుష్యులు ఒక ఒంటెనుగురించి తగవులాడుకొని కాజీని తీర్పు చెప్పమన్నారు. జరిగినంత వరకు అసలు కథలో తేడా ఏమీ లేదు. ఇద్దరి కథా ఒక్కటే. పేచీ అల్లా పర్యవసానం గురించే.

వారిలో ఒకడు కొంచెం ధనికుడు. ఒకడు కొంచెం బీదవాడూను. ధనికుడు ముప్పాతిక వాటా, బీదవాడు పావలా వాటావేసి ఒక ఒంటెను కొనుక్కున్నారు. దానిచేత పనిచేయించేవారు. ఆదాయాన్ని నాలుగు వాటాలువేసి, ధనికుడు మూడు భాగాలు, రెండవ వాడు ఒక భాగము తీసికొనేవారు.

ఒక రోజున ఆ ఒంటె ఒక వాగు దాటుతూ ప్రమాద వశాన కాలు జారిపడి చచ్చిపోయింది.

ఒంటె చచ్చిపోవడం వలన కలిగిన నష్టంలో కొంతయినా సర్దుకోవాలని పెద్ద వాటా వున్న ధనికుడికి దుర్బుద్ధి పుట్టింది.

"ఒంటె మనిద్దరిదీను. కనక నష్టం సమంగా పంచుకోవాలి." అన్నాడు.

మిగిలిన పావలా వంతు వాటాకి సరిపడే డబ్బు తన కివ్వాలంటూ పేచీ పెట్టేడు. ఇద్దరూ కాజీ దగ్గరకు వచ్చేరు.

కాజీ, ఏం చెప్పాలో అయోమయం పాలై ఆయన మౌల్వీని రప్పించేడు. బీదవాడు ఏడుస్తూనే వున్నాడు.

"ఒంటె ఖరీదులో ఆయన మూడు వంతులు ఇచ్చేరు. నేను ఒక్కవంతు ఇచ్చేను."

భాగ్యవంతుడు చెప్పింది నిజమే. మౌల్వీ ప్రశ్నించేడు.

"లాభం ఎలా పంచు కున్నారు?."

"నేను పెట్టిన వాటా ప్రకారం లాభంలో నాలుగోవంతు నేను తీసుకొన్నా."

"ఒంటెకి అయ్యే దాణాఖర్చులుపోను మిగిలిందాంట్లో ఒకవంతు వాడి. మూడువంతులు ఆయనది." అన్నాడు బీదవాడు.

"ఒంటె మా ఇద్దరిదీను. అందుచేత దాని ఖర్చు ఇద్దరం భరించాం. ఇప్పుడు చచ్చిపోయింది. కనక నష్టం ఇద్దరం భరించాలి" అని ధనవంతుడు పూరాపాడా ఏకంచేస్తూ ఏడుస్తూన్నాడు.

బ్రతికివుండగా ఖర్చు సమంగా భరించినప్పుడు చచ్చిపోయినప్పుడు నష్టం కూడా సమానంగానే భరించాలేమో అర్థంగాక బీదవాడు మెతక మెతకగా నానుస్తున్నాడు.

ఒంటె బ్రతికివుండగా దానికయ్యే ఖర్చు విషయంలో ధనవంతుడు బీదవాడిని మోసం చేసాడని మౌల్వీ గ్రహించేడు. అది చూపించి ఇప్పుడు నష్టం కూడా వానినెత్తినే రుద్దాలని ప్రయత్నిస్తున్నాడని అర్థంచేసుకొన్నాడు. ఒక నిముషం ఆలోచించేడు.

"ఒంటె వాగులో మునిగిపోయి చచ్చినప్పుడు దానిమీద ఏమన్నా సరుకువుందా?"

"ఏమీలేదు" అని వాటాదారు లిద్దరూ ఏక వాక్యంగా చెప్పేరు.

"దాని బరువుకదే మునిగి పోయిందన్న మాట."

మౌల్వీ ఈ ప్రశ్న ఎందుకు వేశాడో అర్థంకాక పెద్ద వాటా దారు ఆ విషయాన్నే ఒప్పుకొన్నాడు.

"అవును".

మౌల్వీ తీర్పు ఇచ్చేసేడు

"ఒంటె మునిగిపోవడానికి దాని శరీరం బరువే కారణం. ఆ బరువులో మూడువంతులు పెద్దవాటా దారువయిన నీది. అంటే నీ వాటా బరువే దానిని ముంచేసింది. పావలా వాటా దారుకి నీవల్లనే నష్టం వచ్చింది. కనుక ఆ నష్టాన్ని నువ్వే అతనికి ఇచ్చుకోవాలి" అన్నాడు.

మౌల్వీవాదం సబబుగా వుందని కాజీ దానినే ఖాయం చేశాడు.






## పెద్దకథ : చివరిభాగం

(గత సంచిక తరువాయి)

సాయంత్రం యింటికి వెళ్ళేసరికి సుశీల కాఫీ చేసి సిద్ధంగా పెట్టింది. కాఫీ తాగాక "ఇవాళ ఉద్యోగం కావాలని ఒక వెంకటరమణుడు వచ్చాడమ్మా. బాగా అబద్ధాలు మాట్లాడాడు. నీకు నా దగ్గరికి వెళితే ఉద్యోగం దొరుకుతుందని ఎవరు చెప్పారు" అనడిగాను. భయపడిపోయాడు. అతనేదో చెప్పడానికి భయపడుతున్నా డనిపించింది" అన్నాను. సుశీల ముఖం వెల్లబడింది.

"అతనికి ఉద్యోగం యివ్వదల్చుకోలేదమ్మా" అన్నాను, సుశీల ముఖంలో మార్పు గమనిస్తూ. సుశీల తల వంచుకుని, తన పాదాలు చూసుకుంటూ కూర్చుంది.

భోజనాల దగ్గర సుశీల మౌనంగానే ఉంది. తలెత్తి నా ముఖంకేసి కూడా చూడలేకపోయింది. నాలో కొంత సంతృప్తి కలిగింది.

*　　*　　*

మర్నాడు ఆఫీసుకు వెళ్ళడంతోనే అతని అప్లికేషను తీసి, ఎడ్రసు రాసుకున్నాను. వాళ్ళ యింటికి వెళ్ళి, అతన్ని కొంచెం భయపెట్టి వాళ్ళవాళ్ళచేత కూడా నాలుగు చివాట్లు వేయిస్తే, సుశీలని నేను చివాట్లు వెయ్యవలసిన అవసరం ఉండదని తోచింది.

అదో రకం స్వార్థం.

అయినా బయల్దేరాను.

ఎక్కౌంటెంటుని పిలిచి, "ఓ గంటలో వస్తాను" అని చెప్పి, టాక్సీలో బయల్దేరి, ఆవీధి మొదట్లో టాక్సీ ఆపించి దిగాను. ఇంటినంబరు దొరకింది. తలుపు ఓరవాకిలిగా తీసుంది. తలుపు దగ్గర నిలబడి, "ఏమండీ" అని పిల్చాను.

"ఎవరు ?" అందో ఆడకంఠం.

"వెంకటరమణ లేడా" అన్నాను.

"బజారుకు వెళ్ళాడు. వస్తాడు. కూర్చోండి" అంటూ అతని తల్లి బయటికి వచ్చింది.

నేను ఉలిక్కిపడ్డాను. ఆశ్చర్యంతో అలా ఉండి పోయాను.

రమ ! ! !

"బావా" అంది నన్ను వెంటనే గుర్తుపట్టి. "అలా నిలబడిపోయావేం ! రా ! కూర్చో" అంటూ కుర్చీ వాల్చి వేసింది. కూర్చున్నాను. నా మనస్సు ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యిం ది. రమ కళ్ళవెంట ఆనందభాష్పాలు రాలాయి. "బావా! నువ్వు దేముడివి. ఎప్పుడు తల్చుకుంటే అప్పుడు నీ దర్శనం అవుతుంది" అంది.

ఆనందంతో నానోట మాట రాలేదు.

"బావా ! భగవంతుడు ఉన్నాడనడానికి ఇంత కన్నా నిదర్శనం కావాలా ? అనాడు అన్నమాటలు గుర్తున్నాయా ? చచ్చిపోయేలోగా నీ దర్శనం చేసుకుంటానని అన్నాం—అయితే ఆయన లేరు. నేను మిగిలాను" అంది. రమ కళ్ళవెంట నీళ్ళు జలజల రాలాయి. తన చరిత్ర అంతా చెప్పింది.

"నాలుగేళ్ళ క్రితం వారు పోయారు. అప్పటి నుంచి కష్టాలు ప్రారంభమయ్యాయి. వాడిని టికాన్సు చదివించేసరికి నా ప్రాణం పోయినంత పనయ్యింది. అయితేనేం, వాడు ప్యాసయ్యాడు. కాని ఉద్యోగం—అది మాత్రం లేలికా ! ఏదో కంపెనీలో దరఖాస్తు పెట్టాడట. వస్తుందని గంటలు లెక్కపెడుతున్నాడు. అవును, అన్నట్టు వాడు నీ కెలా తెలుసు ?" అంది.

"వాడు నీ కొడుకని నాకు తెలియదు. కాని మా కంపెనీలోనే వాడు అప్లికేషను పెట్టాడు" అన్నాను.

"మాబావా ! అన్నీ ఎలా కలిసొచ్చాయో ! వాడి వల్లే మనం కలిశామన్నమాట. ఆ ! అన్నట్టు నా మతి మండా ! నీ సంగతి అడగలేదు. నీ కెంత మంది పిల్లలు ? ఏమిటి కథ" అంది.

"పెళ్ళి చేసుకోలేదు రమా !" అన్నాను.

రమ నిట్టూర్చింది.

"బావా ! ఆ పాపం నేను కట్టుకున్నాను కదూ" అంది.

"పాపం కాదు. పుణ్యం అను" అంటూ సుశీలని నేను పెంచడం, ఆ పరిస్థితులు, వివాహం కావడం అన్నీ చెప్పి "మా సుశీలని మీవాడు ప్రేమించాడు. అది ఏమిటో తెలుసుకుందామని, నాలుగు చివాట్లు వేద్దామని వచ్చాను" అన్నాను.

రమ నవ్వింది.

"మాబావా ! ఇప్పు డెలాగ వాడిని చివాట్లు వేస్తావు ? ఎలా వేస్తావో చూస్తాను, వాడు వస్తాడుగా యిప్పుడే" అంది. "అది సరే ! వెంకటరమణ అని పేరు పెట్టావేం" అన్నాను.

రమ నిట్టూర్చింది.

"వారికి వెంకటరమణుడంటే ఎంతో భక్తి. రోజూ దండం పెట్టుకునేవారు. నన్ను రమ అనే రమణియా అని కూడా పిలిచేవారు. కొడుక్కి మాత్రం వెంకటరమణ అని పేరు పెట్టారు" అంది ఆమె కళ్ళు నీళ్ళతో మెరిశాయి.

ఇంతలో రమణ వచ్చాడు. వస్తూనే, నన్ను చూసి, కొయ్యబారిపోయాడు.

"అలా చూస్తావేరా ! ఎవరనుకుంటున్నావు ? మీ పెదనాన్నగారురా" అంది రమ. అతను మరింత హడలి పోయాడు.

"ఏరా అలా చూస్తావు" అన్నాను నేను.

అతను కొస్త తమాయించుకున్నాడు.

"కూర్చో. నీ కోసమే వచ్చాను" అన్నాను.

రమణ కూర్చున్నాడు.

మా కంపెనీలో దరఖాస్తు పెడితే ఉద్యోగం

## సాఫల్యం

వస్తుందని ఎవరు నీకు చెప్పింది ?" అన్నాను. అతను నీళ్లు నమిలాడు.

"ఇంకెవరు ? చెప్పరా భయమెందుకు ?" అంది రమ నవ్వుతూ. రమణ సిగ్గుపడ్డాడు. "వెధవా" అంది రమ.

నేను ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాను.

"రమా ! మళ్లా నిన్ను కలుసుకోగల ననుకో లేదు. అందులో మన బంధుత్వాలు యిలా కలుస్తాయనుకోలేదు. నిజంగా భగవంతుని లీల విచిత్రం సుమా ! ఆ రోజుల్లో మిమ్మల్ని చూడాలని బొంబాయి వచ్చి రెండు సంవత్సరాలు ఉన్నాను. నేనే చూడలేకపోయాను" అంటూ చెప్పాను

"పోనీలే, కావాల్సిన వేళకి కలుసుకున్నాం. సుశీల ఎలా ఉంటుంది ? దాన్ని కూడా తీసుకురాక పోయావా ?" అంది రమ. 'భలేదానివి. ఈ ప్రబుద్ధుడు నీ కొడుకని నాకు తెలుసా ఏమిటి ? సరేలే ! రేపు మీ రిద్దరూ మా యింటికి రండి. ఈలోగా సుశీలని కాస్సేపు ఏడిపించి, నిజం చెప్తాను. కాఫీలవేళకి వచ్చేయండి" అన్నాను. రమ ఒప్పుకుంది.

కాఫీ, టిఫిన్లయ్యాక, ఇంటికి చేరాను. ఇంటికి వెళ్లేసరికి సుశీల నిద్రపోతోంది. నా రాకకి లేచింది. "ఏమమ్మా, పడుకున్నా వేమిటి ? కాలేజీకి వెళ్ల లేదూ ! వంట్లో బాగుండలేదా" అన్నాను.

"కొంచెం తలనొప్పిగా ఉందండి" అంది.

నుదురుమీద చేయివేసి చూశాను. జ్వరంలేదు. వంటావిడని కాఫీ పెట్టమని చెప్పి, ఆఫీసుకు ఫోను చేసి, "యీవాళ్టికి రాను. అర్జంటు కాగితాలుంటే పంపండి" అని ఎకౌంటెంటుకు చెప్పాను.

సుశీల కుర్చీలో కూర్చుంటూ, "బాబయ్య గారూ! మీరు వచ్చేశారేం" అంది.

"నీతో ఒక ముఖ్యమయిన విషయం చెప్పాల నమ్మా" అన్నాను. సుశీల నాకేసి భయపడుతూ చూసింది.

"ఆ రమణ అనే అతని యింటికి వెళ్లాను తల వాచేటట్టు నాలుగు చీవాట్లు పెట్టాలని" అన్నాను.

సుశీల తల దించేసుకుంది.

"నీ కతను ఎలా తెలుసు ?" అన్నాను.

సుశీల మాట్లాడలేదు.

"సుశీలా ! యిలాటి పనులు చెయ్యొచ్చా. ఇలాటి పని చేస్తేకన్నా నన్ను కత్తితో పొడిచి చంపినా ఆనందించేవాడిని కదా" అన్నాను సుశీల వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. నాతో పట్టు నన్నగిల్లింది

"ఇంకెప్పుడూ యిలాటి పనులు చెయ్యను. ఈ తప్పు క్షమించండి జీవితంలో మళ్లీ యిలాటి పొరబాటు చెయ్యను" అంది వెక్కివెక్కి ఏడుస్తూ. నా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. మంచంమీంచి లేచి, సుశీల దగ్గరకు వెళ్లి తల నిమురుతూ, "పిచ్చి తల్లీ, ఏమన్నానని ? అతను కూడా మనకి కావల్సినవాడే ! వాళ్లింటికి వెళ్లాక తెలిసింది. మీకు సమ్మతమైతే నా కభ్యంతరం లేదమ్మా" అన్నాను.

సుశీల ఆశ్చర్యంగా నాకేసి చూసింది.

"అవునమ్మా ! మనకి చాలా దగ్గర బంధువులు వాళ్లు" అన్నాను. సుశీల ఆనందానికి అవధులులేవు.

* * *

భోజనాలుచేసి, ఆరుబైట కూర్చునేసరికి జయ వచ్చింది. తిరునల్వేలి వెళతానన్న మనిషి యింత త్వరగా ఎలా వచ్చేసిందా అని ఆశ్చర్యపోయాను.

"రండి పిన్నీ" అంటూ సుశీల ఎదురువెళ్లి జయ చేతిలో పెట్టె అందుకుంది.

నేను నిట్టూర్చాను. నాలో మార్పు జయ గమనించి, మౌనంగా లోపలకు వెళ్లిపోయింది. నేను ఆలోచనలో పడ్డాను. జయ ఎలాగయినా తనను సుశీల అమ్మా అని పిలిస్తేగాని వదలదు అంటే సుశీలకి విషయమంతా చెప్పాలి.

నా హృదయం పగిలిపోయినట్లయింది.

ఇన్నాళ్లూ పెంచి, యీనాడు సుశీల నా కూతురు కాదని చెప్పాలా ! నన్ను పరాయివాడిగా చూసి, "నన్ను పెంచి, పెద్దచేసి, మా అమ్మ కప్పగించి నందుకు కృతజ్ఞురాలిని" అని సుశీల అంటే నేను బ్రతకగలనా?

సుశీలకి తండ్రిని నేనే అయి పెంచాను. తల్లిని నేనే అయి పెంచాను. కాళ్లమీద పడుకోబెట్టుకుని పాలు పట్టాను. భుజంమీద పడుకోబెట్టుకుని జోల పాటలు పాడాను. అలాటి సుశీలను యీనాడు నేను వదులుకోగలనా .... లేను .... లేనా ..... ఆ ప్రశ్నకి సమాధానం రాలేదు.

ఏది ఏమైనా, నా స్వార్థం కోసం జయను అణ కడం పిశాచి లక్షణం అనిపించింది. ఎలాగూ ఇంత వరకు వచ్చింది. ఇక జయ తన తల్లి అని సుశీలతో చెప్పితీరాలి. అని నిశ్చయించుకున్నాను.

"బాబాయిగారూ ! ఏమిటలా కూర్చున్నారు" అంది సుశీల. ఉలిక్కిపడ్డాను.

"ఏం లేదమ్మా !" అన్నాను.

ముగ్గురం కూర్చుని ఏవేవో లోకాభిరామా యణం కబుర్లు చెప్పుకున్నాము. జయకి మేడమీద మూగది పక్కగదిలో పక్కవేసింది.

నేను మడతకుర్చీలో కూర్చున్నాను. సుశీల ఏదో నవల చదువుకుంటోంది. నేను గొంతు సవరించు కుని, "తల్లీ ! నీకు ఒక గాథ చెప్తాను. ఇలారా" అన్నాను. సుశీల లేచివచ్చి, నా పక్కమీద కూర్చుంది.

జయకు కథ అంతా చెప్పి, "అవిడను తన కన్న కూతురు క్షమించలేదు. పరాయివాడితో లేచిపోయిన వ్యక్తి నా తల్లేమిటి పొమ్మంది. తల్లిని చూడడానికి, తన ముఖం తల్లికి చూపడానికి నిరాకరించింది."

నేను సంతృప్తిగా నిట్టూర్చాను.

"ఇది అలా జరిగిందమ్మా. ఆ సంఘటన గుర్తుకు వచ్చింది. అందుకని చెప్పాను" అన్నాను. సుశీల కన్నీరు తుడుచుకుంది. "పడుకోమ్మా ఇక !" అంటూ నేను లేచాను. సుశీల తన మంచంమీదికి వెళ్లింది. నేను నా మంచంమీద పడుకొని దుప్పటి ముసుగు పెట్టేశాను.

అరగంట గడిచింది.

ముసుగుతీసి లేచాను. సుశీలకేసి చూశాను. మంచినిద్ర పోతున్నట్టుంది. చప్పుడు చెయ్యకుండా తలుపు తీసుకుని, బయటకు వచ్చాను. జయ గదిలో లైటు వేసిఉంది.

ఇక జయితో చెప్ప యీ విషయం సుశీలకి చెప్పవద్దని అని నిర్ణయించుకుని, తలుపు తోశాను తీసున్న తలుపు తెరుచుకుంది

జయ నన్నుచూసి, కన్నీరు గమ్మున తుడుచు కుంది. నేను కుర్చీలో కూర్చోడంతోనే "తిరున ల్వేలి వెళ్లామని జయల్దేరినదాన్ని—కాళ్లు ఆటు వెళ్లలేదు. కంచి వెళ్లి వచ్చేశాను. సుశీల ముఖం చూడాలనిపించింది. తెల్లవారుతూనే పోతాను. బ్రతికి ఉంటే మళ్లీ రావాలనిపిస్తుంది. చచ్చిపోతాను. దానికి శాశ్వతంగా దూరమయిపోతాను. నావల్ల దానికి కళంకం రానీను" అంది వెక్కివెక్కి ఏడుస్తూ.

"ఆవేశపడకు జయా ! సుశీలతో కొంతవరకు చెప్పాను. నిండు మనస్సుతో నిన్ను 'అమ్మా' అని పిలిచేలా ఉంది. అసలు దాని వూహ ఎలా ఉంటుందో అని కథగా చెప్పాను" అంటూ చెప్పిన విషయం చెప్పాను.

"వద్దు ! దాని మనసులో గాయం చేయడం మనకి మంచిదికాదు. నా అపవిత్రత, కళంకం దానికి అంటగట్టను" అంది కన్నీళ్లు తుడుచుకుని, మళ్లీ కారుస్తూ.

"మన చేతుల్లో ఏమీలేదు. అంతా భగవంతుడి లీల. నిన్నిలా కలుసుకుంటానని అనుకున్నానా?" అంటూ రమ సంగతి, రమ కొడుకును సుశీల ప్రేమించిన సంగతి అన్నీ చెప్పి, "నా జీవితం వ్యర్థ మని ఆ రోజుల్లో నేను ఏడ్చే వాడిని. నువ్వుగనుక ఆనాడు సుశీలని నా చేతుల్లో పెట్టకపోతే నేను ఏ ఆత్మహత్యో చేసుకొనేవాడిని" అన్నాను.

ఆ తరువాత సుశీల గుణగణాలు గొప్పవి చెప్పాను. "తెల్లవారితే అన్నీ సవ్యంగా జరుగుతాయి. కాస్త నిగ్రహం ఉంచుకో జయా !" అన్నాను. జయ, నెళ్ళనిక. మళ్లీ సుశీల లేస్తే నాకోసం వెతుకు తుంది." అన్నాను.

"నేను తెల్లవారుతూనే వెళ్లిపోతాను. దాని ముఖం చూడడానికి నాకు ధైర్యం చాలదు. అది అమ్మా అని పిలిస్తే నా గుండె పగిలిపోతుంది తన తండ్రి ఆత్మహత్యకు కారణం అయిన తల్లిని ఏ కూతురు క్షమించదు. నువ్వనవసరమయిన ప్రయత్నాలూ చెయ్యక. నా జీవితం నేను నిర్ణ యించుకున్నాను అంది.

నేను బుర్ర గోక్కున్నాను.

"జయా ! జరిగేది జరగకమానదు. తెగించి యీ రాత్రి ఏ అఘాయిత్యం చెయ్యక. తెల్లవారనీ— అన్నీ శుభంగా జరుగుతా యనుకుందాం" అన్నాను.

జయ నిస్పృహగా నవ్వింది.

"ఆత్మహత్య చేసుకునేంత అదృష్టం నాలాటి పాపికి లేదు. మీరు అలాటి భయం పెట్టుకో కండి. పాపి చిరాయువు అన్న ... ... పుట్టింది" అంది.

నేను తలుపు తీశాను.

ఉలిక్కిపడ్డాను.



ఎదురుగా సుశీల.

కన్నీటితో శోకమూర్తిలా నిలబడి ఉంది. జయ గమ్మున కన్నీరు తుడుచుకుని, మంచంనించి లేచింది. మళ్లీ వెక్కివెక్కి ఏడుస్తూ "అమ్మా" అంటూ జయను కౌగిలించుకుంది.

నా శరీరం పులకరించింది.

"అమ్మా! ఇంతకాలం నాకు దూరమయి, ఇంకా దూరమవుదా మనుకున్నావా? తల్లిని తల్లి కాదనే

## సాఫల్యం

అంత పాపినా నేను" అంది వెక్కివెక్కి ఏడుస్తూ.

నా కంటినుంచి నీరు రాలింది.

ఎదురుగా గోడమీద వెంకటరమణుని పటం—అనాటి పటమే !!

చేతులెత్తి నమస్కరించాను.

ఆరోజుల్లో నా జీవితం వ్యర్థమని, నిస్సారమని ఏడ్చాను. దైవనింద చేశాను.

కానీ, భగవంతుడు ఏ పనీ కారణంలేనిదే చెయడు. అది మానవులకు అర్థం గాకపోవచ్చు.

అవును. నా విషయంలో అదే నిజం అయ్యింది. నా జీవితం ధన్యమయింది.

నా కర్తవ్యాన్ని జయప్రదంగా నెరవేర్చాను. నేను ధన్యజీవిని.

అవును నేను ధన్యజీవిని. (అయిపోయింది) ★

# వర్ధమాన నర్తకి యడవిల్లి రమ



లలితకళల్లో కూచిపూడి నృత్యానికొక ప్రత్యేక స్థానమున్నది. ఈ నృత్యానికి జన్మస్థానం ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణాజిల్లా యందుగల కూచిపూడి గ్రామం. శాస్త్రీయ నృత్యానికి కూచిపూడి నృత్యం ఇంకొక పేరనవచ్చు. ప్రారంభంలో యిది కూచిపూడి భాగవతాలుగా వాడుకలో ఉండేది. వాటికొక రూపాన్నిచ్చి ఈనాడు మనం చూస్తున్న కూచిపూడి నృత్యంగా ఆరు శతాబ్దాల క్రితమే సిద్ధేంద్రయోగి తీర్చి దిద్దారు. తరతరాలుగా ఈ నృత్యం సాధకుల చేతుల్లో మారుతూ వస్తున్నప్పటికీ అది తన స్వత సిద్ధమైన ప్రత్యేకతను పోగొట్టుకోకుండా, ఆధునిక నృత్యాల ప్రభావానికి గురికాకుండా వచ్చింది. ఈ నృత్యంలో ప్రధానంగా పరిశ్రమ చేయవలసిన అంగం పాదం. నృత్యానికి ప్రాణం లాంటిది అభినయం. అదే కూచిపూడి నృత్యాన్ని మహనీయంగా రూపొందించే శక్తి. సాధకుల అభినయాన్ని బట్టి నృత్యం విలువ పెరుగుతుంది.

విజయవాడ వాస్తవ్యులైన కె. కె. యడవిల్లి ప్రకాశరావుగారి కుమార్తె కుమారి యడవిల్లి రమ కష్టసాధ్యమైన ఈ నృత్యం పట్ల ప్రత్యేకాసక్తి చూపింది. కుమారి రమ వెంపటి చిన్న సత్యంగారి వద్ద నృత్యాన్ని అభ్యసించింది. నృత్యంలో పరిణతి పొంది 1964 ఏప్రిల్‌లో మద్రాసు నందు ఆరంగేట్రం జరుపుకున్నది. అనంతరం కుమారి యడవిల్లి రమ అత్యంత నైపుణ్యంతో పలుచోట్ల పెక్కు ప్రదర్శనలిచ్చి ప్రేక్షకుల మెప్పు పొందింది.

కూచిపూడి నృత్య ప్రదర్శనలో మొత్తం పది భాగాలుంటాయి— రాగమాల, స్వరజాతి, కృష్ణశబ్దం, కీర్తన, తారంగం, శ్రీరామపట్టాభిషేకం, తిల్లానా, దశావతారములు, కృతి, సత్యభామాప్రవేశము. వీటన్నిటికి అభినయం తలమానికము వంటిది. కుమారి యడవిల్లి రమ వీటిని ప్రతిభావంతంగా పెక్కుచోట్ల ప్రదర్శించి ప్రేక్షకామోదమును పొందింది.

ఈమె ప్రదర్శనల్లో, గాత్రాన్ని ఆమె సోదరి కుమారి యడవిల్లి స్వర్ణకుమారి యివ్వటం యింకొక ఆసక్తికరమైన విషయం.

శాస్త్రీయ నృత్యాల్లో ప్రత్యేక విలువను కలిగి ఉన్న ఈ కూచిపూడి నృత్యంలో కుమారి యడవిల్లి రమ ఇంకా కృషి చేసి ఉన్నత [illegible]

# సరాగమాల



వి. ఎ. కె. రంగారావు

**ఉయ్యాల—జంపాల జి ఇ 3548 /**

ఒక్కటి తప్ప అన్నీ మంచి పాటలే యీ చిత్రములో వాటిలో ప్రథమ స్థానం పొందేది "కొండ గాలి తిరిగింది" ఇక రెండు, మూడు స్థానాలను ఆక్రమించుకొన్న రెండు పాటలు యీ రికార్డులో ఉన్నవి

పురాణాలలో రమ్యమైనది భాగవతం అందులో తీయనిది బమ్మెర పోతనార్యుని రచన అందులో మధురతమము రుక్మిణీ కల్యాణ ఘట్టము ఆ మాధుర్యాన్ని, ఆ మకరందాన్ని, ఆ మధువుని దొంగిలించి ఇక్కడ పొందుపరచారు ఆరుద్ర

"కన్నెపిల్ల మనసు మీ అన్నకేమి తెలుసు
శిశుపాలుడికన్న ఆ శ్రీకృష్ణుడు మిన్న
రమణీ ప్రేమ సొంపు నువు రాయబార మంపు
గౌరిపూజచేసి ఆ గర్భగుడిలో వేచి
ఎదురుచూడవమ్మా నీ బెదురు మానవమ్మా
తన్మయైనవాడు ఒక రథము తెచ్చినాడు
రుక్మిణమ్మా కృష్ణమూర్తితో పోవు
లలికావమ్మా—॥

ఆనాటి మధురభావన కొల్లగొనకపోతే యీనాటి కవిపుల కెక్కడిది ఆ సౌందర్యం ?

పాట మొదటు వినవడే దరువు మీ హృదయ స్పందన వేణువు మీ మానసవంశి ఆ పాట మీ మదిలోని మాట సుశీల కలకంఠ, స్వర్ణలత లేత బెల్లం, రుచులు చవి చూపిస్తారు మీకీ పాటలో

రెండవప్రక్క పాట రామునిపైన అదీ యింత అందమైనదే ఆరుద్ర రచనే

"అనుభవించదగిన వయసు అడవిపాలు చేసెను
అడుగు పెట్టినంత మేర ఆర్యభూమి జేసెను
ధర్మపత్ని చెరబాపగ దనుజుని దునుమాడెను
ధర్మము కాపాడుటకే నలినే విడెను
ఎవరు ?
అందాల రాముడు ఇందీవర శ్యాముడు
ఇనకులాబ్ధి సోముడు అందువలన దేముడు

ఈ పాట మేష్టారమ్మతో(సినిమాలో) పాడించారు కాబట్టి 'దేముడు' బదులు 'దేవుడు' అనిపించి ఉంటే బాగుండేది పి లీల బృందం యీ పాట విందుగా పాడారు రెండిటిలోను పెండ్యాల గొప్పతనం యెందులో ఉంది ? ముత్యాల వంటి మాటల ప్రాముఖ్యతనంతా వదిలి, వాద్యగోష్ఠి లీలామాత్రంగా నిల్పటంలో ఉంది

హీరాకుడ్‌నుంచి బండారు సూర్యారావ్ 'ఉయ్యాల—జంపాల' పాటల గురించి యిలా వ్రాశారు

"ఇందులో తమ ప్రతిభను బాగా చూపించారు అన్ని పాటలు బాగున్నాయి చాల కొత్త తరహాగా ఉన్నాయి కాని, ఒక విషయం మాత్రం నాకు చాల నిరాశని కలిగించింది జంగ్లీ ట్యూన్‌కు కొంత తమ స్వంత ట్యూన్ జోడించి ఘంటసాల—సుశీలలతో పాడించి అటు దక్షిణాది కొండా యిటు ఉత్తరాది సింగడా కాకుండ తయారుచేసి ఆ ఎవి మాతో చూప్పించేరు ఆ దృశ్యం ఎంత ఎబ్బెట్టుగా ఉందో పాట దాని ముత్తాతలాగా ఉంది అనువమాన ప్రతిభావంతులైన పెండ్యాల యిలా ఎందుకు చేశారో అర్థంకాకుండా ఉంది" నిజమే నాకు కూడా అర్థంకాలేదు పెండ్యాల వరస వేయడమే కాదు తిలక్ తీసిన చిత్రంలో అటువంటి పాట ఉండటం, దానికి జగ్గయ్య, కృష్ణకుమారి నర్తించటం యిన్నీ బాధాకరమైన విషయాలే

పెండ్యాల సంగీతం వినాలంటే, ఒక్కొక్క సంగతిలోనూ భూమ్యాకాశాలను చూడాలంటే హరిశ్చంద్రలో పాటలు, ముఖ్యంగా లీల పాడిన తిల్లానా, వరలక్ష్మి పాడిన లాలిపాట వినండి. ఇందులో మరొక పాటలో కె వి రెడ్డి సహాయ దర్శకుడైన శింగీతం సంగీతం ఉంది, సరదాపాట సరదాగా ఉంది

**ఉయ్యాల—జంపాల ఎన్ 69831**

ఆరుద్ర రచన గురించి యిదివరకు అన్న మాటనే మళ్లీ అంటున్నాను ప్రేమికుల గుండెల్లో గుసగుసలు దొంగిలించినందుకు ఆయనమీద ఎవరూ దావా వేయరేం ! ఒకవేళ ఆ గుసగుసలు ఆయన హృదయారామజనితాలేమో ?

కొండగాలి తిరిగింది గుండె వూసులాడింది
గోదావరి వరదలాగ కోరిక చెలరేగింది
పట్టపగలు సిరివెన్నెల భరతనాట్య మాడింది
పట్టరాని లేత వలపు పరవసించి పాడింది
పడుచుదనం అందానికి తాంబూల మిచ్చింది
ప్రొద్దుమున్న తీరానికి పడవ సాగిపోయింది

ఈ పాట అందానికి కొంత కారణం భరణి కోటేశ్వరరావు శబ్దగ్రహణం వాద్యగోష్ఠి కంఠాలను ముంచివేయకుండా జోడించిన ఘనత వారిదే ఈ వరసని వూహించి, వాద్యానుసరణను వంగ సప్తతిలో అమోఘంగా అమర్చి, సుశీల ఘంటసాలతో యింత కమ్మగా పాడించిన పెండ్యాలకు మనస్సులో నమస్సులు అర్పించుకోవాలే గాని రాసే దేసేదిలేదు గత అయిదేళ్లలో "అలిగినవేళ" తరువాత హాయినీ అందాన్ని యింత యింపుగా మేళవించిన పాట మరి రాలేదు

రెండవ ప్రక్క బాలమురళి పాడిన తత్వాలు మాటలు ఆరుద్రవి వరస నా కంతగా నచ్చలేదు కాని, బాలమురళి కంఠాన్ని విని మైమరచేవారు [illegible] ★



[illegible] సత్యనారాయణ శాస్త్రి

# ప్రేమా, పురుషులూ

నా చేత షేక్స్పియర్, షా, టాల్ స్టాయి, టర్గనేవ్ ల పుస్తకాలు చదివించాడు.

నా భావనా ప్రపంచపు పరిధులనిపెంచాడు. నా చిన్న ప్రపంచంలో నుంచి విడుదల చేశాడు ఆర్సన్.

అతని ప్రణయ ప్రదర్శన ధోరణి చాలా విచిత్రంగా ఉండేది. అప్పుడప్పుడూ సైన్యాల కోసం వేసే 'మాజిక్ షో'తో బాటు ఇదీ కానిచ్చేవాడు.

అతని పాదాలలో కావలసిన వంపు లేకపోవటం వల్ల సైన్యంలో చేర్చుకోలేదు. కాని వీలయినప్పుడల్లా సోల్జర్లకి వినోదాలు విలాసాలు ఏర్పాటు చేసేవాడు. వారానికి మూడుసార్లు నేనూ, జోకాటన్ అతనితోబాటు వెళ్ళేవాళ్ళం.

ఈ మాజిక్ షోలలో నన్ను గాలిలో పైకి లేచేట్లు చేసేవారు—అంతా తంత్రమే, మంత్రం లేదు! గాలిలో వెల్లకిల్లా తేలుతూ స్టేజి వెనక భాగంలో నుంచునివున్న ఆర్సన్, జోలని వెక్కిరించి నవ్విద్దామనుకునేదాన్ని. కాని చివరికి నన్నే నవ్వించేవాళ్ళు వా రిద్దరూ.

మరొక తమాషా — జోకాటన్ ఒక ట్రంకు పెట్టెలోకి దిగేవాడు. ఆర్సన్ మూతమూసి కత్తితో ఎన్నో పోట్లు పొడిచేవాడు. కొంతసేపు తర్వాత, మూత తీసిన తర్వాత, జో బయటికి వచ్చేవాడు. చప్పట్ల చప్పుడు ఆగిపోయిన పిమ్మట నేనూ బయటికి వచ్చేదాన్ని!

ఒకరాత్రి ట్రంక్ తాళం పని చెయ్యలేదు. జో, నేనూ లోపల గాలిలేక ఛస్తిపోయాము! ఇక లాభం లేదనుకుంటూ ఉండగా 15 నిముషాలు గడిచాయి.

ఆర్సన్ తాళం చెవి తీసుకువచ్చి మమ్మల్ని విడిపించాడు. ఆ తర్వాత నేను మళ్ళీ ఆ 'ట్రిక్'లో వెయ్యలేదు.——

మరో 'ట్రిక్' లో ఒక తుపాకి మనిషి ఆర్సన్ నోట్లోకి రైఫిల్ పేల్చేవాడు. ఆ తుపాకి గుండు మీద ఒక గుర్తు చేసేవారు— అదే గుండు ఆర్సన్ పళ్ళ మధ్య కనిపించేది!

ఇది పెద్ద పనేమీ కాదు. తుపాకి మనిషి పేల్చేప్పుడు కొంచెం పక్కకి పేలుస్తాడు. ఆర్సన్ గుర్తు చేసిన మరొక గుండుని పళ్ళ వెనుకకి రప్పించేవాడు..,

కాని తుపాకి పేల్చేవాడు కొంచెం ఏమ్రానా డయితే, ఏదో తిక్కపుట్టి నోట్లోకే గురిపెడితే? ఈ భయం ఆర్సన్ కి ఎప్పుడూ ఉండేది! ....

ఒకరోజు రాత్రి విక్టర్ నన్ను హఠాత్తుగా టెలిఫోన్ మీద పిలిచాడు. (అప్పుడతను సముద్రంమీద ఎక్కడో ఉన్నాడు.) వెంటనే ఆర్సన్ తో తెగతెంపులు చేసుకోమన్నాడు.

కాని—నాకు జీవితంలో చలాకీతనం, సరదా మాత్రమే కాదు, కొంచెం సాంస్కృతిక అభివృద్ధి కావాలి. ఆర్సన్ ఇది ఇవ్వగలడు.

విక్టర్ తోనే తెగతెంపులు చేసుకున్నాను.

7—9—1943 న ఎక్ జడ్సన్ తో నా విడాకులు పూర్తిగా అమలు అయింది అదే రోజున నేను కొలంబియా అధిపతి హేరీ కోహెన్ తో పెళ్ళి చేసుకోబోతున్నానని చెప్పాను.

4-22 కి నేనూ ఆర్సన్ సాంటా మోనికా సిటీహాల్ (లైసెన్సు కని) చేరుకున్నాము. మరొక ఎనిమిది నిమిషాలలో ఆ ఆఫీసు మూస్తారనగా ఎలాగో వివాహం ముగించాము. పెళ్ళికి వచ్చిన పెద్ద మనుష్యులు జో కాటన్, ఆర్సన్ పెంపుడు తలిదండ్రులు- డాక్టర్ బెర్న్ స్టెయిన్, ఆయన భార్య, ఆర్సన్ మేనేజర్ జాక్సన్ లైటర్.

అందరిలో జో ఒకడే చక్కటి బట్టలు వేసుకు వచ్చాడు. ఆర్సన్ తన మామూలు 'యూనిఫారం' వేసుకుని ఉన్నాడు—బూడిదరంగు సూటు, నల్ల బో, గులాబీరంగు షర్టు. నేను ఒక సూటు, ముదురు గోధుమరంగు టోపీతో వచ్చాను.

ఆర్సన్ కంగారులో నా వేలికి ఉంగరం తొడుగటానికి కూడా కష్టపడ్డాడు. మా వివాహాన్ని జరిపే జడ్జి ఇది చూసి ముందు నా చేతిని రెండు చేతులతో పట్టుకుని వణుకు తగ్గిన తర్వాత ఉంగరం తొడగమన్నాడు!

వార్తాపత్రికలవారు మా 'హనీమూన్' ని గురించి చాలా పరిహాసాలు ఆడారు. వివాహం జరిగిన భవనం లిఫ్ట్ దిగేలోపల అయిపోయిందన్నారు.

మర్నాడు 6—30 కి స్టూడియోకి షూటింగ్ కోసం వెళ్ళాను. అక్కడ, జీన్ కెల్లీ నాతో అన్నాడు, "ఆర్సన్ తో గడుపవలసిన రోజున ఇక్కడ ఉన్నావే" మిటని.

"ఇంకా ఎంతో కాలం ఎలాగూ కలిసే X దు పు తా ము గదా!" అన్నాను నేను.

ఈ పెళ్ళి చాలాకాలం నిలుస్తుందనుకున్నాను నేను.

(సశేషం



'ప్రమీలార్జునీయం'లో శీల, ఎన్ టి రామారావు, సరోజా దేవి

## పి ఏ పి క్రొత్తచిత్రం

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి క్రొత్త సాంఘిక చిత్రం షూటింగు యీనెల మూడవ వారంనాటికి పూర్తి అవుతుంది ఇటీవల నాగార్జున సాగర్‌లో అయిదు రోజులపాటు నాగేశ్వరరావు, జగ్గయ్య ప్రభాకరరెడ్డి, గుమ్మడి, రమణారెడ్డి, సావిత్రిలతో అవుట్‌డోర్ షూటింగ్ జరిపి వచ్చారు కుమారి రాజశ్రీ, క్రొత్తనటి జయలలిత, సంధ్య హేమలత మున్నగువారు కూడ యీచిత్రంలో వున్నారు కథ యద్దనపూడి సులోచనరాణి సంభాషణలు ఆత్రేయ, గీతాలు ఆత్రేయ, సి నారాయణరెడ్డి, దాశరథి, సంగీతం టి చలపతిరావు, కెమెరా సెల్వ రాజ్, సహకార దర్శకుడు తాతినేని రామారావు దర్శకత్వం: కె ప్రత్యగాత్మ, నిర్మాత. ఏ వి సుబ్బారావు.

## ప్రతిజ్ఞా పాలన

మే నెల మొదటివారంలో సురేష్ ఎక్సర్స్ యూనిట్—వారి "ప్రతిజ్ఞాపాలన" చిత్రం కొరకు దిగువకల్లు వాటర్ ఫాల్స్‌వద్ద, సిర్కాడులోను అవుట్‌డోర్ షూటింగ్ జరిపి వచ్చారు రెండు పాటలు—ఒకటి రాజశ్రీపైనా, మరొకటి రాజశ్రీ, కాంతారావుల మీదా చిత్రీకరణ జరిపారు కొన్ని ముఖ్య సంభాషణ దృశ్యాలను కూడ అక్కడ చిత్రీకరించారు రాజనాల, పద్మనాభం, బాలకృష్ణ కె వి యస్ శర్మ, ఏ ఎల్ నారాయణ, కోటే శ్వరరావు, ఎల్ విజయలక్ష్మి మురళి బాల సరస్వతి రాజశ్రీ,పుష్పవల్లి యితర నటీనటులు ఉన్నారు సంభా షణలు: సముద్రాల (జా), పాటలు ఎ నారాయణ రెడ్డి, దాశరథి, సముద్రాల (జూనియర్) కొసరాజు, సంగీతం వేణు, నృత్యాలు కె యస్ రెడ్డి, కళ ఎ వి రాజేంద్రకుమార్ కెమెరా: అన్నయ్య సహాయదర్శకుడు శేషగిరిరావు, దర్శకుడు సి యస్ రావు మే నెలాఖరుకు యీచిత్ర నిర్మాణం ముగియ గలదని నిర్మాత శ్రీ డి. రామానాయుడు చెప్పారు ఆంధ్రలో యిది విజయా పిక్చర్స్‌వారి ద్వారా విడుదల అవుతుంది

## చిత్రలహరి

## రాజభక్తి

మల్లికార్జున స్వామి ఆలయంలో యువరాణి మల్లిక— అఖండజ్యోతికి నమస్కరించి తండ్రి చెంతకు వచ్చినది ఆమె కన్నులు ధారాపాతంగా వర్షిస్తున్నవి మహారాజ ధర్మతేజుని హృదయం కుమార్తె వదనం చూసి తరుక్కుపోతున్నది ఓదార్చే ప్రయత్నం చేస్తూ "ఊరుకోతల్లీ! ఊరుకో' అన్నాడు

అయినా ఆమె బాధ తీరుతుందా! ఆ లోటు పూడుతుందా?

'నాన్నా! ఈ జ్యోతిని చూసినప్పుడల్లా అమ్మను చూసినట్లే ఉంటుంది అమ్మతో మాట్లాడి నట్లే వుంటుంది అన్నది మల్లిక

ధర్మతేజుడు జ్యోతి వంక దృష్టిని బరుపుతూ 'నిజమె నమ్మా! అదే స్పష్ట చిత్రం! నానవుడు మొదలు, పది ఏళ్ళవయసు వరకు కనిపెంచిన తల్లి అంటే అంతటి ఎనలేని ఆనందానుభూతిని పొందు తారు!" అన్నాడు

"నాన్నగారూ అంతఃపురంలో పుట్టిపెరిగినా దురదృష్టవంతులు అదృష్టవంతులు కాలేరు! చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకున్న నేను ఎంతటి దురదృష్టవంతురాల్ని!" అన్నది నిట్టూరుస్తూ మల్లిక

ఆ ప్రస్తావన మార్చకపోతే కుమార్తె మరింత క్రుంగిపోతుందని తలచి ఆఁ, అమ్మా వెళదామా!" అన్నాడు అడుగు ముందుకు వేస్తూ మహారాజ ధర్మతేజ

హృదయ విదారకమయిన యీ సన్నివేశం శివశక్తి మూవీస్‌వారి "రాజభక్తి" చిత్రంలోనిది ఇది మే 13వ తేదీన సినీ స్టూడియోలో చిత్రీకరించారు ధర్మతేజగా ధూళిపాళ, మల్లికగా కుమారి రాజశ్రీ చక్కని నటనను కనపరిచారు ఈ చిత్రంలో యింకా కాంతారావు నాగభూషణం, బాలకృష్ణ, రాజ్ బాబు, ఏ వి సుబ్బారావు (జా), జగ్గారావు, వాణిశ్రీ, ఉదయలక్ష్మి నటిస్తు న్నారు సంగీతం కోదండపాణి, కెమెరా వెంకట్ వారణాసి, దర్శకత్వం: యస్ ఆర్ పుట్టన్నశర్మ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ డి. బి నారాయణ. ఇందులో కుమారి రాజశ్రీ రెండు వేషాలు వేస్తు న్నది. ఒకటి యువరాణి, మరొకటి కోయపిల్ల



'ప్రతిజ్ఞా పాలన'లో రాజశ్రీ, వాణిశ్రీ

# చిత్రలహరి

...పాదటివేషం కన్న రెండవ వేషంలో ఆమె బాగా రాణించిందనీ, అద్భుతంగా చేసిందనీ రషెస్ చూసిన వారి వార్త.

## రిక్షా రంగయ్య

మోహన్ మూవీస్‌వారి "రిక్షా రంగయ్య" చిత్రం యింతవరకు ఎనిమిది రీళ్ళు పూర్తి చేసుకున్నది. జగ్గయ్య, కృష్ణకుమారి, యస్ వి రంగారావు, జి. వరలక్ష్మి, వాణిశ్రీ, చలం, చదలవాడ కుటుంబరావు మొదలయిన వారు నటిస్తున్న యీ చిత్రానికి శ్రీ కోటయ్య దర్శకత్వం వహిస్తున్నారు. సంగీతం: పెండ్యాల కృష్ణమూర్తి, కెమెరా: నిమయ్‌ఘోష్. తరువాత షెడ్యూల్ జూన్ మొదటి వారం నుంచి ఆరంభమవగలదని తెలుస్తున్నది.

## భక్త పోతన

భారత ప్రొడక్షన్స్ అనే నూతన చిత్ర నిర్మాణ సంస్థ శ్రీ జి రామినీడు దర్శకత్వంలో "భక్త పోతన" చిత్రం నిర్మించనున్నది. పోతనగా గుమ్మడి, శ్రీనాథుడిగా యస్ వి రంగారావు, పోతన కుమారుడు మల్లనగా హరనాథ్ నటిస్తారు. సముద్రాల రాఘవాచార్య రచన చేస్తున్నారు. సంగీతం యస్ రాజేశ్వరరావు, కెమెరా: పి నాగేశ్వరరావు నిర్వహిస్తారు. శ్రీమతి అంజలీదేవి యీ చిత్రంలో ఒక ప్రముఖ భూమిక పోషించ వచ్చునని తెలుస్తున్నది.

## పీలునామా

అజయ ఫిలింస్‌వారి "పీలునామా" చిత్రం షూటింగ్ తిరిగి మే నెల 5 నుండి 14 వరకు పది రోజులు వరుసగా విక్రమ్ స్టూడియోలో జరిగింది. జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, పద్మనాభం, బాలయ్య, కృష్ణకుమారి, గీతాంజలి ప్రభృతులు మొదలయినవారు నటిస్తున్నారు. సంభాషణలు పిని సెట్టి, గీతాలు: సి నారాయణరెడ్డి, దాశరథి, కొసరాజు, సంగీతం: అశ్వత్థామ, నృత్యాలు: చిన్ని—సంపత్, కళ: వి. వి రాజేంద్రకుమార్ బి ఏ, కూర్పు: అంకిరెడ్డి, కెమెరా: ఎం జి సింగ్, దర్శకత్వం: కె. హేమాంబరధరరావు. ఇందులో ఒకప్పుడు వెండితెరపై విశేషఖ్యాతి సాధించిన శ్రీ సి హెచ్,



'దేవత'లో వాణిశ్రీ

గరాయణ అతిథినటుడిగా కనిపిస్తారు జూన్ ఆఖరుకు లోపలే ఈ చిత్ర నిర్మాణం పూర్తి అవుతుందని నిర్మాతలలో ఒకరయిన శ్రీ ఎం కె రెడ్డి చెప్పారు సహాయదర్శకులు పి లక్ష్మీనారాయణ, కె గోపాలకృష్ణ

## నటి జానకి కుమారై వివాహం

ప్రసిద్ధ సినిమాతార శ్రీమతి శంకరమంచి జానకి తన జ్యేష్ఠపుత్రిక చి కీ యజ్ఞప్రభను, అలహాబాద్ వాస్తవ్యులు శ్రీ కోటి రామచంద్రరావుగారి కుమారుడు చి ఉదయభానుకి ఇచ్చి మే 13 వ తేదీన తిరుపతికి సమీపంలోగల తిరుచానూరులో వివాహం జరిపించింది ఘనంగా సినిమా పరిశ్రమకు సంబంధించిన అనేకమంది పెద్దలు, ఇతర ప్రముఖులు వివాహానికి హాజరయి వధూవరులను ఆశీర్వదించారు వధువు యజ్ఞ మెట్రిక్యులేషన్ పాసయినది వరుడు మద్రాసు సెంట్రల్ లెదర్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో సీనియర్ రిసెర్చి

## పిల్లల చిత్రం

తెలుగులో "చిన్నవాని కానుక" అనే పిల్లల చిత్రం ఒకటి వస్తున్నది ఇది తమిళ మలయాళ, కన్నడ భాషల్లో కూడ నిర్మింపబడుతున్నది తెలుగు చిత్రానికి సంభాషణలు పాటలు బైరాగి వ్రాశారు. ఎడిటింగ్ సి పి జంబులింగం నిర్వహిస్తున్నారు ఈ చిత్రం తాలూకు ఫైనల్ మిక్సింగ్ వర్క్ కొండాయిలో రాజకుమార్ కాకుందిర్ (కాంతారావ్) స్టూడియోలో జరుగుతున్నది. యూనిటీ ఎంటర్ ప్రైసెస్‌వారు ఈ చిత్రాన్ని జూన్ నెలలో విడుదలచేసే ఏర్పాట్లలో ఉన్నారు

## సూర్య ఆర్ట్‌పిక్చర్స్

సూర్య ఆర్ట్‌పిక్చర్స్ అనే నూతన చిత్ర నిర్మాణ సంస్థ తమ తొలి ప్రయత్నంగా ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నది. జానకి, బాలయ్య, సత్యన్నారాయణ, పెరుమాళ్ళు, పేకేటి శివరాం, జయంతి రామచంద్రరావు, జూనియర్ సావిత్రి మొదలయిన వారంతా తారాగణంలో ఉన్నారు రచన రాజశ్రీ, సంగీతం సత్యం, కళ : శ్రీనివాసరావు కెమెరా సంజీవి, కూర్పు మందరం, దర్శకత్వం : పి రామారావు, నిర్మాతలు లక్ష్మణ్—నాగేశ్వరరావు. వీనస్ స్టూడియోలో నిర్మించబడే ఈ చిత్రం జూన్‌నెలనుంచి సెట్స్‌పైకి వెళుతుంది

## ఆడబ్రతుకు

జెమినీవారి సాంఘిక చిత్రానికి "ఆడబ్రతుకు" అని నామకరణం చేశారు ఈచిత్రంలో యన్ టి. రామారావు, యస్ వి. రంగారావు, కాంతారావు, రాజనాల, ముక్కామల, పద్మనాభం, అల్లు రామలింగయ్య, సత్యన్నారాయణ, మహంకాళి వెంకయ్య, దేవిక, గీతాంజలి, పుష్పవల్లి, ఋష్యేంద్రమణి, ఎం వి రాజమ్మ, మాస్టర్ షహీద్, బేబీ ఫరిదా నటించారు 'హని' అనే అల్సేషియన్ డాగ్ కూడా ఇందులో పాల్గొన్నది రచన : ఆత్రేయ, దర్శకుడు వేదాంతం రాఘవయ్య ఈ చిత్రంలో సి నారాయణరెడ్డి ఆరు పాటలు వ్రాశారు వాటిలో అనార్కలి నృత్య నాటిక హైలైట్‌అనీ, ఉన్నత శిఖరాల్లో సాగినదనీ అంటున్నారు త్వరలో ఆంధ్రదేశం అంతటా విడుదల కానున్నదీ చిత్రం.

— మోహన్‌కుమార్ ★



'ముగ్గురమ్మాయిలు—మూడు హత్యలు'లో సావిత్రి.

నిర్మించబూనడం బాధ్యతతో కూడుకొన్న పని అయితే— దానిని ప్రజానుగుణ్యంగా రూపొందించి డబ్బుచేసుకోవడం మరొక బాధ్యత ఆ బరువు బాధ్యతలు మోసి, అనుభవించిన వ్యక్తులు చిత్ర పరిశ్రమలో అరుదుగా కనుపించుతారు అలాంటి వారు కొద్దిమంది మాత్రమే ఉన్నారు. వారిలో శ్రీ విఠలాచార్య ఒకరు.

కొత్తగా పరిశ్రమలోకి వచ్చి చిత్రాలు నిర్మించే వారికీ, నిర్మించాలనుకునేవారికి విఠలాచార్యగారి చలనచిత్ర జీవితం చక్కని ఆదర్శంగా నిలుస్తుంది వారికి ఉపకరించుతుంది ఎన్నో విషయాలను చెబుతుంది.

నిర్మాతగా విఠలాచార్యగారి ఫిల్మ్ కెరీర్ 1943 లో ఆరంభమయింది ఎనమండుగురు భాగస్తులతో, రెండున్నర లక్షల మూలధనంతో సినిమా కంపెనీ ప్రారంభించారు నిర్మించిన తొలి చిత్రం (కన్నడం) ఫ్లాప్ అయింది. అందులో డబ్బు రాకపోవడం .. (ఇప్పుడు భావనారాయణ గారి చిత్రాలకు దర్శకునిగా వ్యవహరించుతున్న జి విశ్వనాథం అప్పట్లో వారి చిత్రాలకు ఎడిట రుగా ఉండేవారు )

తరువాత "జగన్మోహిని" అనే చిత్రం ఆయన నిర్మించ తలపెట్టారు. దర్శకుడు ఎవరూ దొరక లేదు వారికి. మనమే ఎందుకు చెయ్యగూడదను కొని ఆ చిత్రానికి విఠలాచార్య, శంకర్‌సింగ్ తొలి సారిగా సంయుక్త దర్శకత్వం చేశారు దానిలో ఫైట్స్, కామెడీ, సాంగ్స్ పిక్చరైజేషన్ విఠలా చార్య తీశారు జగన్మోహిని చిత్రం కన్నడదేశ మంతటా రజతోత్సవాలు జరుపుకొన్నది లాభాలు బాగా వచ్చినవి దానితో స్టూడియోకి సంబం ధించిన సామగ్రి కొంత కొని మహాత్మా స్టూడియో స్థాపించారు, 1951 లో

1953 లో విఠల్ ప్రొడక్షన్స్ స్వంత సంస్థను ఆరంభించి కన్యాదానం చిత్రం తీశారు అది వీటిలో ఒక్క 'విజయసింహ' తప్ప, మిగిలినవన్నీ లాభం చేసిపెట్టినవి. ఇవిగాక కన్నడంలో ఐదింటికీ తమిళంలో రెండు చిత్రాలకూ దర్శకత్వం వహిం చారు

పెళ్లిమీద పెళ్లి, విడుదల చేశాక శ్రీ విఠలా చార్య ఓసారి రాజమండ్రి వెళ్లడం సంభవిం చింది అక్కడ బస్‌స్టాండ్‌లో జానపద సాహిత్యానికి సంబంధించిన పుస్తకాలు మంచివి రెండణాలకు మూడణాలకు అమ్ముతున్నారుట ఎవరో. దీని వల్ల ఏదైనా ప్రయోజనం ఉండవచ్చునని, ఎందుకు పోనివ్వడం అనుకొని మొత్తం పుస్తకాలన్నీ గుత్తగా కొనేశారుట "ఈ సాహిత్యంలో యిన్ని పుస్తకాలన్నీ విరివిగా వెలువడుతున్నప్పుడు ఈ తరహా చిత్రాలు తీస్తే ప్రజలు ఎందుకు ఆదరించరు?" అనే యోచన తట్టింది ఆయనకు. అలా అనుకున్నప్ప టినుంచి యిప్పటివరకూ ఆయన తీసిన జానపద చిత్రాలన్నీ ప్రజాదరణ పొందుతూనే ఉన్నవి స్వల్ప



# నేటి ప్రేక్షకుల మర్మమెరిగిన విఠలాచార్య

లక్షా యాభైవేల రూపాయలు నష్టపోయారు. దానితో ఎనమండుగురు భాగస్తుల్లోను నలుగురు ఆ సంస్థ నుంచి విడిపోయారు. మిగిలిన ధనంతో మరొక చిత్రం నిర్మించారు అదీ పోవడంతో ఆ డబ్బు కూడా పోయింది కంపెనీలోంచి మరొక యిద్దరు తప్పుకున్నారు ఇక మిగిలిందల్లా విఠలా చార్యగారు, డి శంకర్‌సింగ్ (ఇప్పుడు కన్నడ పరి శ్రమలో పేరుపొందిన దర్శకుడు) గారూను

ఈ అపజయాలకు శ్రీ విఠలాచార్య కృంగి పోలేదు మనస్సును దృఢంగా నిల్పుకుని 'మనం విజయం ఎందుకు సాధించలేమో, చూద్దాం !' అంటూ శంకర్‌సింగ్ భుజం తట్టారు అపుడు విఠలాచార్యగారికి మూడు సినిమా థియేటర్లు, రెండు హోటళ్లు ఉండేవి వాటిని విక్రయించి మళ్లా రంగంలోకి దుమికారు. 1948 లో మహాత్మా పిక్చర్స్ అనే సంస్థను స్థాపించి '(స్ట్రేంజ్ బ్రదర్స్)' కృష్ణ చిత్రం నిర్మించారు ఈ చిత్రం మైసూరు రాష్ట్రమంతటా వంద రోజులు ఆడింది. కూడా పెద్ద హిట్ తన చిత్రాలకు కథలు, సినిమా అనుకరణలు ఆయనే- చేసుకుంటూండేవారు

టెక్నికల్ యింప్రూవ్‌మెంట్‌కోసం 1954 డిశంబర్‌లో మద్రాసు వచ్చారు శ్రీ సుందర్‌లాల్ నహతా గార్ని ఒకసారి కలిసినపుడు "మీరు తెలుగులో చిత్రాలు ఎందుకు తియ్యకూడదు?" అని అడిగారు విఠలాచార్యని ప్రోత్సహించారు ఆ ప్రోత్సా హాన్ని, ఆయన ఉత్సాహాన్ని ఊతగా తీసుకొని అప్ప ట్నుంచీ తెలుగు చిత్రాల నిర్మాణం ఆరంభించారు

తెలుగులో శ్రీ విఠలాచార్య తీసిన మొదటి చిత్రం 'కన్యాదానం' ఆ తరువాత వరుసగా వద్దంటే పెళ్లి, పెళ్లిమీద పెళ్లి, జయవిజయ, వరలక్ష్మీ వ్రతం, కనకదుర్గ పూజామహిమ, మదనకామరాజు కథ, గురువును మించిన శిష్యుడు, నవగ్రహ పూజా మహిమ, అగ్గిపిడుగు చిత్రాలు ఆయన స్వంతంగా నిర్మించి, దర్శకత్వం వహించినవి ఖైదీ కన్నయ్య, బందిపోటు, విజయసింహ చిత్రాలు సుందర్లాల్ గారికీ, అన్నాచెల్లెలు మోడరన్ థియేటర్స్‌వారికీ, స్వవధిలో చిత్రాలు నిర్మించే విధానం పరిశ్రమకు అలవాటు చేసినది విఠలాచార్యగారేనని చెప్పవచ్చును. ఇవాళ జానపద చిత్రాలు నిర్మించుతున్న వారందరికీ ఆయన మార్గదర్శకులనడంలో అత్యుక్తి లేదుకూడ.

స్క్రిప్ట్, పరికరాలు అన్నీ సిద్ధం చేసుకొనిగాని విఠలాచార్య సెట్సుమీదికి వెళ్లరు సెట్‌కి వచ్చిన దగ్గర్నుంచీ షూటింగ్ ముగిసేదాకా తనుకూడ శ్రమించి పనిచేస్తారు. ఎంత బిజినెస్ మైండ్‌గా కనిపించుతారో మనసంత మెత్తనిదీ, మంచిదీను. ఒక నటుడు నట్సుతూ మాట్లాడుతూండే వారుట. ఆయన టేక్‌కి సిద్ధమయ్యేప్పుడల్లా ఈయిబ్బంది ఏర్పడుతూ వుండేదిట విఠలాచార్య యిదికాదు పని అనుకొని తన బంధువులైన ఒక డాక్టర్‌చేత ట్రీట్‌మెంట్ చేయించి యావజ్జీవితమూ ఉండే ఆ బాధను ఆనటునికి తప్పించారు

ఉదయం ఏడు—ఎనిమిది గంటలమధ్య విఠలా చార్యగారిని చూసేందుకు, వారి ఆఫీసుకు నిత్యమూ ఎవరో కొందరు వస్తూనే ఉంటారు. వారిలో

# న్యూఢిల్లీ లేఖ

11 వ పేజీ తరువాయి

ప్రభుత్వపు ఛీఫ్ సెక్రటరి శ్రీ బి. శివరామన్ ఛైర్మన్‌గా భారత ప్రభుత్వం నియమించిన కమిటీ ప్రకటించాలి. ఎరువుల్ని వ్యవసాయదారులకు అందించే సంస్థలు కూడా వాటికి సంబంధించిన పూర్తి విజ్ఞానాన్ని తెలుసుకుని ఉండాలి వ్యవసాయదారులకు సాంకేతిక సంబంధంగా సలహాలనివ్వటానికి సహకార్య యితర ప్రతినిధి సంస్థలు తగినస్థితిలో ఉండాలి. వీటన్నింటిని దృష్టిలో ఉంచుకుని సరఫరా సవ్యంగా జరిగేలా ఏర్పాట్లు చేయాలి.

*　　*　　*

చైనా వాళ్ళు అణ్వస్త్ర పరీక్ష జరిపిన నాటినుంచి దానిపై మనదేశంలో వాస్తవ దూరమైన విద్వత్ చర్చలు జరుగుతున్నాయి. ప్రతిపక్షాలు అణ్వస్త్రాల తయారీకి ఒత్తిడి చేస్తున్నట్లు ఒకవైపు తెలుస్తూనే ఉంది. కానీ ప్రభుత్వం అణ్వాయుధాలను వ్యతిరేకిస్తున్నది కాబట్టి ఇండియాలో వాటి తయారీకి అవకాశంలేదు మరోవైపు ఇండియాను తల్చుకున్న పన్నెండునెలల్లోగా అణుబాంబుని పేల్చే స్థితికి యింతకుముందే తీసుకువచ్చానని డాక్టర్ బాబా చెప్పున్నారు మరోవైపు 'బ్రిటిష్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్ట్రాటజిక్ స్టడీస్' ఛైర్మన్ శ్రీ ఆల్‌స్టెయిర్‌బుచన్ తమ బి బి సి ప్రసారంలో, ఇండియా తగినంతగా అణ్వాయుధాలు సమకూర్చుకోడానికి సుమారు 2700 కోట్ల రూపాయలవుతుందని ఇటీవలే ప్రసంగించారు ఇంత వ్యయంతో వీటిని తయారు చేస్తే అవి ప్రయోగశాలల్లో ప్రదర్శన వస్తువులు కాకూడదు కదా! వాటిని పరీక్షించాలి భారతదేశంలో ఈ పరీక్షలకుపయోగించే విమానాలు లేవనటమే ఈ సమస్యనుంచి తెలివిగా తప్పుకోడానికి మార్గం. ఇండియా విమానాల్లో అయిదు రకాలున్నాయి. అయితే ఆలోచించ దగ్గ విషయం అవెంత ఆధునికంగా ఉన్నాయనేదే! ప్రస్తుత ముఖ్యాంశం పదిహేడేళ్లనుంచి అలక్ష్యం చేసిన రక్షణ ఏర్పాటును పటిష్టం చేసుకోవటమే. గత పది సంవత్సరాలలో పాకిస్తాన్ అమెరికానుంచి 1500 కోట్ల రూపాయల విలువగల ఆయుధ సామగ్రిని పొందిందట. ఆత్మ రక్షణకి కూడా తయారుగా లేనంతగా దేశం ఎలా నిర్లక్ష్యం చేయబడిందన్న విషయం భావి చరిత్రకారులకు సమస్య కాకూడదు. ప్రభుత్వం పంచశీలనే దృఢంగా నమ్మి, సరిహద్దురోడ్లను నిర్మించటం కూడా అనవసర వ్యయమనుకున్నది.

ప్రస్తుత పరిస్థితులనిబట్టి చూస్తే అణ్వస్త్ర నిర్మాణం సంగతి అలా ఉంచి విమానశాఖను దృఢతరం చేసుకోవటం ముఖ్యమని తేటతెల్లమవుతున్నది.

—శ్రీకృష్ణ ★



# మీరు త్రాగే ప్రతికప్పు టీ రుచి, సువాసన పోకుండా వుండాలని బ్రూక్ బాండ్ వారు ఎలా తాపత్ర్య పడుతున్నారంటే

ఓ కప్పు టీ మీకు ఎంత ముఖ్యమో — అదేవిధంగా సువాసన, కమ్మదనం ముఖ్యంగా టీలో వుండితీరాలి అని బ్రూక్ బాండ్ వారు రుచి చూడటంలోను, బ్లెండింగ్ చేయటంలోను, టీ సరఫరా చేయటంలోను వారికిగల 68 ఏండ్ల అనుభవంతో తెలుసుకో గలిగారు.

వారికి గల ముఖ్యమైన బ్లెండ్లలో ఒకదానిని తయారు చేయడానికి బ్రూక్ బాండ్ టీ టేస్టర్లు నిత్యం 800 రకాలకు పైగా మాదిరి చూస్తారు. వీటిలో 30కి పైగా వేరువేరు తోటలనుండి వచ్చే టీలను ఎంచి, ఆఖరి బ్లెండు ప్రత్యేక సువాసన కమ్మదనాలతో మీ అభిరుచులకు తగినట్లుగా వుండే టట్లు హామీ యిస్తారు.

కాని యింత నేర్పుతో చేసే టీ బ్లెండింగు ఒక్కటే సరిపోదు. ఎంత శ్రేష్ఠమైన బ్లెండ్లయి నప్పటికి సువాసన, కమ్మదనం పూర్తిగా అమర వుండాలంటే అవి తప్పనిసరిగా తాజావే అయి వుండాలని బ్రూక్ బాండ్ వారికి తెలియని సంగతి కాదు. తాజాదనం పోకుండా వుండాలంటే టీని గాలి చొరలేని డబ్బాలలో ప్యాక్ చేయడం ఒక మార్గం. అలా చేస్తేనే నాణ్యత తగ్గకుండా, శక్తి లేకుండా టీ లభిస్తుంది.

బ్రూక్ బాండ్ వారు యింతటితో ఊరుకోలేదు. వారి సేల్స్‌మెన్ స్వయంగా ఎప్పటికప్పుడు తాజా సరకులను సరాసరి 6లక్షల షాపులకు వారంవారం అందిస్తుంటారు. వీటిలో మీదొకటి అందుకే మీరు కొనే బ్రూక్ బాండ్ టీ మిక్కిలి తాజాగా లభిస్తుంది .... ఎప్పుడూ ఒకే రుచి, సువాసనలను ఇస్తుంది.




BWTBB2408

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 5&7 Thambuchetty Stree
Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.

